ఉ. నిద్దుర లేచి తొంటికర
ణిం బ్రణమిల్లుము! భర్తృచిత్రముం;
బ్రొద్దుట సాయపుందతినిఁ
బూజలొనర్పుము వానివిగ్రహం;
బద్ధము కన్నదోయికిని
నా భగవానుని విగ్రహంబుతో;
నద్దియు నీకుఁగూర్చును మ
హత్తర శాంతిని నమ్ము! సోదరీ! ౧౯౦

కం. పరులను భావింతువు సో
దరులని; వర్తిలుదు దేవతాభక్తిని; నీ
వెఱుఁగుదువు పుణ్యసాధ్వీ
చరితములు; వచింపఁదగ్గ సంగతు లున్నే? ౧౯౧

మ. చనుమీ! సోదరి! యింటి; కింకెపుడు నీ
చందాన రాఁబోకు! ని
న్ననుమానింతురు; సాధ్వి మైథిలికె క
ట్టా! యెట్టి నీలాపనిం
దను గల్పించెను; గాకిమూఁక యనుచున్
నమ్మందగున్ లోకమున్;
మనుమీ! సందగపట్టరాబగతి మా
న్యంబైన శీలంబునన్. ౧౯౨

చ. అని వచియించినం జనక
 యట్టులె చిత్రపుబొమ్మకైవడిం
గనుచుఁ, దనుం గటాక్షతతిఁ
 గట్టుచునున్న లతాంగిఁ జూసి యా
ఘనుఁ డురితాళ్ళు ద్రెంచుకొని
 క్రన్నన బైటికిఁ గాలుదూసి వ
చ్చిన హరిణంబురీతి నిలి
 చెం దిగి సౌధమునుండి క్రిందికిన్ ౧౯౩

౭. స్త్రీప్రసరాజ్యమహత్త్వము (౨)

కం. చనె నొకనాఁడు నరేంద్రుఁడు
వనంబునకు స్వీయసఖులప్రార్థనఁ దద్వా
హనముపయిన్ వాహ్యాళికి
వినోదమొప్పార సంజవేళం బ్రియతన్. ౧౯౪

కం. ఫలములతోడ, రసాయన
ములతోడ, మిఠాయితోడఁ బొలుపారఁగ వె
న్నెలవిందు లారగించిరి
యల చెలికాండ్రచటి రమ్యహర్మ్యమునందున్. ౧౯౫

ఆ. పుచ్చపువ్వుచందమునఁ బండువెన్నెల
గనులవిందుగాఁగఁ గాయుచుండె
మలయమారుతములు మలయుచుండెను ; కీర
శారికాళిపాడె శ్రావ్యగీతి. ౧౯౬

కం. ఆటలతోఁ, బాటలతో,
మాటలతో నొకరినొకరు మరియుఁ గడచి పూఁ
దోఁట విహరించి "మన మీ
పూట వసింతమిటఁ బ్రొద్దువోయె" నని రోగిన్. ౧౯౭

కం. "అదిపాడుమోయి! బీతే!
ఇది పా"డని తమకుఁ దమకు హితమగు పాటల్
పదుగురుఁ బాడించుచు న
య్యదన న్నాయాసపఱచి రాతనినిఁ గడున్. ౧౯౮

ఆ.వె. "విశ్రమింపు" మనుచు బీలేకు గదిసూపఁ
బోయి యతఁడు దలుపు మూసి పండె;
వెలిసె నంత గదిని గలగల మంజీర
కంకణారవములఁ గలికి యొకతె. ౧౯౯

కం. తెరచాటున నిలఁబడెనో!
పరికింపఁగరాక కలదొ? పానుపుక్రిందన్;
అఱబిత్తలయై కన్నులు
మిఱుమిట్టులు గొలుపుచున్న మెయిజిగి మెరయన్. ౨౦౦

కం. కోరడాతోవలె జడతో
శరములతోవలెఁ గటాక్షజాలముతోఁ దా
గుఱిసేసి గుండ్లతోవలె
నదుదెంచెను బొమ్ములొడ్డి యతనిందాఁకన్. ౨౦౧

కం. జిలుఁగుల, లలితాంగమ్ముల,
వలరుసరుల, వలపుఁజిమ్ము చది మోహిని నాఁ
దళుకులు బెళుకులు, గులుకులు
నొలికించుచు నడచి పాన్పునొద్దన్ నిలిచెన్. ౨౦౨

చ. తెఱచి యతండు గన్గనను
దివ్యవిలాసినివోలె నున్న య
త్తెఱవను గాంచి యద్భుతమ
తిన్ నడఁ దల్పము డిగ్గి "అమ్మ! యె
వ్వరివవు? మూసినట్టిదగు
ద్వారము మూసినయట్టులుండె; నె
క్కరణినిఁ జొచ్చి తెగదెఁ ద
గం బ్రతిబింబకముద్దనుం దటుల్. ౨౦౩

కం. పరపురుషుఁడనగు నాద
గ్గఱి కిట్టి నిశీథమున దొకర్త విటుల్ నీ
వరుదెంచుట గర్హ్యము ; నీ
చరిత్రమున మచ్చవుట్టు సాధ్వీ! చను" మనెన్. ౨౦౪

కం. కలకలనవ్వులు దీపపు
వెలుంగుఁ గిడ్పఱచి పండువెన్నెలఁగాయన్
బలుకులఁ గురియుచుఁ దియ్యని
పులకండంబులు వచించెఁ బూఁబోఁడి యిటుల్. ౨౦౫

కం, " ఇది నాగది ; యిది నాపా
న్పిదిగో ! నీసఖులు నాకు హితసఖులు ; భవ
త్సదృశుల కాతిథ్యంబిడు
చుఁ దలంతుఁ సతత మొంద శోభనశతముఁ. ౨౦౬

కం. పరపురుషులు స్వపురుషులని
పరికింపము నేము భేదభావము ; మాకె
ల్లరును సఖులె ; మాచరితము
సరసస్తుత్యము ; సదా వసంతమె మాకున్. ౨౦౭

కం. "కొను మిదె! పాద్యం"బని యా
తనిపయిఁ బన్నీరు సల్లి తడయక "యిదె! కై
కొను మర్ఘ్య"మంచుఁ దనకర
మునఁ గల మల్లియలు విసరివుచ్చె నతనిపై. ౨౦౮

ఆ. వె. బెడఁదవచ్చెనంచుఁ వెన్క-వెన్క-కు రోసి
జరిగె మొగముముడిఁచి ; జాఱిఁబైఁట
వాని కేలువట్టఁ బోఁజె నాజంతయు ;
సందకతఁడు సురిగె నందు నిందు. ౨౦౯

కం. దినమును నిశచందంబున
నిను సంధ్యాకాంతవోలె నెన్నో గతులం
గొని, వానిఁబట్ట యత్నిం
చిన నాజవ్వని కతండు చేపడఁ డయ్యెఁ. ౨౧౦

కం. గలగల మ్రోయఁగ నూపుర
ములు పరుగిడు చతనిఁ బట్టు పూనికిఁ బడెఁ గా
ఘలకడ్డఁగఁ బావడ కు
చ్చెలు ; కుమతుల తలఁపులెల్ల సిద్ధము లగునే ! ౨౧౧

కం. వలఁజిక్కి చించి యెట్లో
వెలికుఱికిన పులుఁగునోలె "బీతే" వడి నీ
వలఁబడి గ్రహించి యది మి
త్రులకుట్రని వారిఁజూడ గోసి మదిఁ జనెన్. ౨౧౨

కం. ప్రవరాఖ్యుని యవతారమొ ?
నవీన లీలాశుకుండో ? నారీవిముఖుం
డవసని మరొకఁడెవ్వఁడు ?
పువువిల్తుని దాసులయిరి ముప్పగుమూర్తుల్. ౨౧౩

## ౫ దారిద్ర్యము–దైవప్రార్థన

కం. జనకుండు విశ్వనాథుఁడు
చనస్వర్గంబున కొసరెచ్చె సహగమనం బా
యన వెనుకలిమియు నాతని
వెనువెంటనె పుణ్యసాధ్వి వితమునఁ గట్టా! ౨౧౪

గీ. తల్లి భువనేశ్వరీదేవి తారు దోడఁ
బుట్టువులు నల్వురను బాసిపోవలిబ్బి
నెండబెట్టకు నీరెల్ల నింకిపోవ
బైటఁబడినట్టి చేపలపాటు గొనిరి. ౨౧౫

ఉ. గుండెగలోని కాపురము
గుప్పిటిలోనికి వచ్చెఁ; జుట్టమొ
క్కండును జూడరాఁడు; చెలి
కాఁ డొకఁడేనియుఁ బల్కరింప రాఁ
డంతకు; నుత్తమర్ణులు గ
టా! యమకింకరులట్లు చుట్టి; రా
లెం; డిల సందుఁజూచి కబ
ళింపఁ బయింబడు నెల్లనర్థముల్.

కం. అఱకసుపుఁ దోడ మాసిన
చిరిగినపుట్టంబుఁ దోడఁ జెప్పులయిన లే
కరుగుఁ గళాశాలకు నా
నరేంద్రుఁ డోర్పుమెయిఁ గాలినడఁ గడుదవ్వుల్. ౨౧౭

చ. వెలితిపడండు లేదనుచు;
స్వీయకుటుంబపుఁ గష్టపాటు లె
ట్టులొ? గ్రహియించి యొజ్జలు క
డుం దయనొంది నరేంద్రు విందుకై
పిలుతురు; పస్తుఁబండుకొనఁ
బిన్నలుఁ బెద్దలు నింటఁ దాఁ దినం
దలఁచునె? తెల్పఁ డేనెపమొ!
తప్పుకొనుం బలుమాఱు లొప్పుగన్.

కం. తన బడిజీతముఁ గట్టిరి;
తనయింటికి భోజ్యవస్తుతతియు ధరింపం
గను నూత్నవస్త్రజాలం
బనిపిరి; యాతం డెఱుంగఁడయ్యెను వేఱో? ౨౧౯

కం. "పని-చితి వీవే"యని యో
జనములా! తెచ్చిచ్చిరంచు శాలాచార్యుం
డును, జనయిత్రియుఁ దెలిసిరి;
యనేకయత్నము లొనర్చె నాచూకి గొనన్. ౨౨౦

కం. ధనయౌవనవరలావ
ణ్యనిధానంబయిన యొక్కయంగన యమ్మో
హనమూర్తికోఱకు డెందం
బున నువ్విళ్లూరు నింటివిముం దరుగుతఱిన్. ౨౨౧

కం. ప్రతిదినముఁ గళాశాలకు
గతాగతంబుల నొనర్చు కాలంబున నా
సతి చక్కఁగ ముస్తాబై
రతివలె సమ్మదనమూర్తి రహి నీక్షించున్. ౨౨౨

ఆ. వె. వెడలునపుడు వాని వెంబడింజని మళ్లు;
వచ్చునపు డొనర్చు స్వాగతంబు;
మల్లెపూలఁజల్లు; నల్లకల్వలు గప్పు
మగువచూపు వాని మార్గమందు. ౨౨౩

గీ. ముక్కునకుసూటిగ నతండు పోవుఁగాని
శిరసుఁ బ్రక్కకుఁద్రిప్పి వీక్షింపఁ డెవరిఁ;
గలికియొక్కతె తనపైనిఁ గన్నువేసి
యిట్టులు వ్యయించుచుంట నూహింపఁ డయ్యె. ౨౪

చ. "త్రికరణశుద్ధిగా నిను వ
రించితిఁ; దావకపాదపద్మసే
వకుఁ దపియించుచుంటి; నెల
ప్రాయము జన్నియవట్టియుంటి; మ
త్సకలముఁతోడ నాకగుము
స్వామివి; నాదగుకోర్కెఁ గాయ సే
యకు; దయసేసి మామకగృ
హం బొనరింపుము! స్వర్గభూమిగన్.

కం. ఈయూపదాస్తియును నీ
దే; యోఁ బ్రతినిధిని; విని త్వదీయస్థితి నా
థా! యువ్వి యివ్వి పంచితి
నీయానతిఁగొనక; సైఁపు నేరమునోనిన్." ౨౬

కం. అని వ్రాయఁబడిన యొకలే
ఖను గ్రిందటనున్న సంతకముఁగని తన పే
ఠినినున్న జమీందారుని
తనయుని గ్రహించి రోసి దాసినిఁ జించెన్. ౨౭

కం. ఆనాటినుండి సూతం
డా నవలాయింటివీథి కడుగునిడక చు
ట్టైనను మరొక్కమార్గము
లో నిచ్చలు రాకపోకలు పొనర్చఁ దగన్. ౨౨౮

కం. ఒకదినము తపాలావాఁ
డొక మడఁచినకమ్మఁదెచ్చె; నొగిఁ దెఱువంగా
నొక పదివేరూకల "చె
క్కు" కానఁబడి యక్కజంబుఁగొలిపె నతనికిన్. ౨౨౯

కం. "కనువిందైతివి; మును నా
పెనిమిటితో నాగృహంబు విజయంచేయన్;
నినుఁజూపి యేఁగుగడగాఁ
జనె నాతఁడు నెలకుముందు స్వర్గంబునకున్. ౨౩౧

కం. వినితివి నాదౌర్భాగ్యము;
వినితి భవద్దుర్గతియును; వెనుకెవ్వరు లే
ర్వను నాకు; నీవె సర్వం
బనుకొంటిని; భర్తృమిత్రుఁ డాత్మీయుఁడ కా! ౨౩౧

కం. ఈపైకము నీకిమ్మని
నాపతి సెలవిచ్చె; నీవు నాకగుదువటం
చూపిరితో నుంటినిఁ గా
కీపాటికి నతనివెంట నేఁగియ యుందున్. ౨౩౨

గీ. జలధరమునకుఁ జాతకలలనవోలె
జాబిలికి వెన్నెలపులుంగుచందమునను
స్వాతివానకు శుక్తియువలెనె యోన
రేంద్ర! నీరాకకై పెద్ద యెదురుసూతు." ౧౩౩

కం. అని యున్న జాబునుం గని
ననఁబోఁడి తలం పెఱింగి నానాకథలున్
వినియుంట దానిఁగూఱిచి
వెనువెంటనె యతఁడు ద్రిప్పివేసెను "చెక్కున్." ౧౩౪

కం. నిరతము దారిద్ర్యాంబుధిఁ
దరింపఁదరిలేక బిట్టు తప్పుండయ్యున్
సిరిరా మోఁకాలొడ్డిన
నరేంద్రుఁడు యతీంద్రుఁడే యనం జెల్లదొకో? ౧౩౫

కం. ఒకనాఁడు రామకృష్ణుని
నికటమునకుఁ జని స్వకీయనిష్ఠురదారి
ద్ర్యకఠోరయాతనలు విని
చి కరంగఁగఁజేసె నతనిచిత్తంబు గడున్. ౧౩౬

సీ. "మనవియొనరించి లోకైకమాతయైన
కాళికాదేవి నా కనుగ్రహము సూపు
క్రమముఁ జింతింపుఁ; డాతల్లి "కాదు నాడు"
భక్తజనకల్పవల్లి మీ ప్రార్థనంబు." ౧౩౭

గీ. అని నరేంద్రుండు మ్రోల దీనాననమున
నిలువ శ్రీరామకృష్ణుండు వలికె నిట్లు
"వేడ నైతిని ము;న్నింక వేడఁబోవ
వెడఁగుకోర్కులు నాకేనిఁ బెజిలకేని." ౨౩౮

కం. అని నిర్మొగమోటంబుగఁ
గనికర మది లేనివానిగతి నని "ఓయీ !
చని నీవయి ధ్యానింపుము
మనోరథముఁ దెల్పి లోకమాతను భక్తిఁ." ౨౩౯

చ. అనుడు నరేంద్రుఁ డేఁగి విన
యంబున సాఁగిలి దేవిముందటం
దనమదికోరికిఁ మఱచి
"తల్లి! మరల్చి ప్రపంచదృష్టి నా
కనయ మొసంగుమమ్మ! భవ
దంఘ్రిసరోరుహాభక్తి, జ్ఞానముం
గనుఁగొని నన్ను సంసరణ
కూపమునుండి సముద్ధరింపుమా! ౨౪౦

మ. అని ప్రార్థించి కడిందివచ్చెఁ; "గురుఁడ
భ్యర్చించితే?" యన్నఁ జే
సినవిజ్ఞాపనఁ దెల్పెఁ; "గ్రమ్మఱను సం
సేవించి యాచింపుమీ!

యనే; నాతండును మోఁకఱిల్లి మరలం
ప్రార్థించె ము న్నట్లె; “హా
మ్మ” నె నాచార్యుఁడు వెండియు న్నతఁడదే
యర్థించెఁ జిత్రంబుగన్. ౨౪౧

గీ. కాళికాదేవి సత్కటాక్షంబు; రామ
కృష్ణుని మనోరథంబు; నీ క్షితిపురంధ్రి
దివ్యచిత్తం బదేయెమొ! తెలియు నేరి?
కా నరేంద్రుండు ముమ్మాఱు నట్లె కోరె. ౨౪౨

గీ. పేడకై కామధేనువు వేఁడు నెవఁడు?
గోచికై చక్రవర్తినిఁ గోరు నేఁడు?
అర్థి చింతామణిని దేవి నాశ్రయించి
పామరుఁడుదక్క గోరఁ డప్పగిది నెవఁడు? ౨౪3

గీ. దేవి దర్శింప డెందంబు దిరిగిపోయెఁ
బ్రాక్తనంబైన పుణ్యంబుపండి యప్పు;
డైహికకలాపమందు నిరీహుఁడయ్యె;
నక్కజంపడెఁ దవస్థ కతఁడె కడిఁది. ౨౪౪

కం. పలికెనిటు రామకృష్ణుఁడు;
“బలవత్తర మీశ్వరేచ్ఛ; ప్రాపింతువు ని
ర్మలభక్తిజ్ఞానంబులె;
యలకాళీమాతహృదయ మార్ద్రము నీపై.” ౨౪౫

## ౯. ఉపదేశము

గీ. తదుపదేశంబు శ్రుతిసమ్మితంబ యయ్యు
గాదు ప్రభుసమ్మితం ; బింకఁ గమ్మనిదయి
మిత్రసమ్మితమై సమున్మేష మొసఁగి
హృదికి నానందసందోహ మిచ్చుచుండు. ౨౭౬

కం. ఒకనాఁడు నరేంద్రాదులు
ఒకచోఁ గూర్చుండి " దేవుఁడున్నాఁడె ? త్రయీ
ప్రకరం బపౌరుషేయమొ ?
సకలంబగు శాస్త్రచయము సత్యమొ"! యనుచున్. ౨౭౭

గీ. కడచి యొండొరులను దర్కకౌశలంబు
నెలయ వాదోపవాదముల్ సలుపుచుండి;
రద్ది యాలించి నగుచు నేమనక గురుఁడు
వెడలె నదివైపు వారును వెంబడింప. ౨౭౮

మ. కనుఁగొం చాతటమందు నొండొరులతోఁ
గాట్లాడుచుం, జించుకోం
చునుగొంతుల్, బహుభంగులన్ మొఱుఁగు కొం
చుం, బైకి దూఁకాడుచుం
డినకొన్నింటిని, మెల్లఁగా మెదలకా
పొంకిం గనంబడ్డ పీ
స్గను భక్షించెడి శ్వావరాహకములం
గొన్నింటినిన్, నవ్వుచున్. ౨౭౯

కం. కనుఁగొనుఁడని శిష్యాళికిఁ
గనుంబఱచె ; వారు దాని గ్రహియించి నతా
నను లై స్వశుష్కతర్కము
లను రేఁపక ధ్యానయోగలగ్నులయిరిఁకన్. ౨౫౦

కం. "తనుఁదాను దెలిసికొనుటే
సనాతనం బైన ధర్మసారము ; షడ్ద
ర్శనములు వేదంబులు నా
ల్గును జదివినఁ దల్లక్రిందులుగ వృథయ సుఁడీ ! ౨౫౧

కం. తనుఁదా జయించు నాతని
కనులకు సాక్షాత్కరించుఁ; గా కవ్విధిఁ జే
సిన నేండ్లుఁ బూండ్లుఁ దపముల
నణుమాత్రంబేని దేవుఁ డగపడఁడు సుఁడీ ! ౨౫౨

గీ. ఏడ్చినను బిల్లనుం దల్లి యెత్తికొనును ;
గ్రాఁగినను లెస్స పాలు మీఁగడ లభించు
గాఢసంతాపమునఁ జేసి కలుగుఁగాని
దైవసందర్శనము;గా దప్రయత్నముగ మీకు. ౨౫౩

కం. ప్రతిమానవుఁడును మాధవు
ప్రతిబింబ మటంచు మీరు భావించుచు సం
తతమును సేవింపుఁడు ; వ
ర్ణతారతమ్యంబు క్షాళనము సేయుఁ డెదన్. ౨౫౪

గీ. మీరు త్రికరణశుద్ధులై మెలఁగికొండు !
సరకుసేయకుఁ డన్యదూషణము లెపుడు;
కుక్క మొఱుఁగుల జీటికింగొనునె యేన్గు ?”
లనుచుఁ బ్రత్యుత్తరించు శిష్యాళి కతఁడు.

కం. గురుదేవునోటిప్రత్య
క్షర మసిధారావ్రతంబు చందంబున నా
చరణ మొనర్చి నరేంద్రుఁడు
పరశిష్యగణంబునందుఁ బ్రముఖుం డయ్యెన్.

కం. అరిషడ్వర్గముఁ ద్రుంచెను
విరాగదివ్యాస్త్రమూని వీరేశ్వరతన్ ;
ధరణి సనాతనధర్మో
ద్ధరణ మొనర్పన్ నరేంద్రతన్ మది నూనెన్.

మ. తన శిష్యావళిలో నరేంద్రుఁడొకఁడే
తారాగణంబందుఁ జం
ద్రునిచందంబున వెల్గుటంగని తదిం
దుం డెప్పుడున్ వృద్ధిఁబొం
ద, నమావాస్యలుఁ, గృష్ణపక్షములు క్షీ
ణత్వంబు గల్పింపకుం
డను, బ్రార్థించును రామకృష్ణుఁడు జగ
న్మాతన్ మహాకాళినిన్.

గీ. రామకృష్ణుని వదనచంద్రామృతంబు
నాననరేంద్రచకోరకం బానుచుండుఁ;
దరుగ దొకబిందువేని సుధారసమునఁ;
దనియదు చకోర మెన్నాళ్లు ద్రావుచున్న. ౨౫౯

కం. "తన యాధ్యాత్మిక సంపద
కనంతరీయుఁడు నరేంద్రుఁ డభయమిడి మిముం
గని పెట్టు నాతఁ"డని ప
ల్కెను శిష్యులతోడ రామకృష్ణుఁ డొకతఱిన్. ౨౬౦

మ. దినముల్ రాత్రులు నిర్వికల్పకసమా
ధిన్ మున్గి బ్రహ్మైకని
ష్ఠ వినోదించెడి భాగ్యలబ్ధి కభిలా
షం దెల్ప శిష్యుం 'డెఱుం
గవు కాఁబోలును దానికంటె శతథా
గాణేయమైనట్టి భా
గ్యవిశేషంబును నున్నదోయి!" యని య
య్యాచార్యుఁ డున్నేత్రుఁడై. ౨౬౧

గీ. నిర్గుణబ్రహ్మ మొండె ధ్యానించుకొనుచు
సకలకర్మోపరతుఁడౌ టసాంప్రతంబు;
స్వయముగాఁ దీర్ణుఁడగువాఁడు సలుపవలయుఁ
బరుల నుత్తీర్ణులుగఁ; గా కెవండు సలుపు? ౨౬౨

ఆ.వె. ఒక్క దివ్వె వెలిఁగి పెక్కింటి దూదివ
త్తులను దివ్వియలుగ సలుపుపగిదిఁ
దీర్ఘుఁడైనవాఁడు దీనుల లాఁతులఁ
దగునుసుమ్ము! తీర్థులుగ నొనర్పు. ౨౬౩

కం. అరయఁగ సగుణబ్రహ్మము
చరాచరంబైన జగము; జగతీరూపుం
బరమాత్మను సేవించుటె
పరులఁ దరింపించుటనఁగ భావింపు మెదన్. ౨౬౪

సీ. కడుపుఁజిచ్చార్పఁ గ్రుక్కెఁడు గంజి దొరకక
మలమల పలుమంది మాఁడుచుండ్రు
మానసంరక్షకై మేనిపై జింకిపాఁ
తయు లేక పెక్కండ్రు తలఁకుచుండ్రు
తగు మందుమాఁకులొప్పఁగు పథ్యపానముల్
వడయక కొందఱు మడియుచుండ్రు
కడు మూర్ఖులై నిరక్షరకుక్షులై యథః
పతితులై యెందఱో బ్రతుకుచుండ్రు.
గీ. మనలలోపల నున్నట్టి తనదుఁగాదె?
భగవదంశంబు వీరి లోపల నరేంద్ర!
ఇట్టి దీనులసేవయు నేల పెక్కు?
భగవదారాధనంబని వలయుఁదలఁప. ౨౬౫

కం. కనులర్పించెను గ్రుడ్డికిఁ;
దినఁగా బెబ్బులికొసంగె దేహంబు నహో!
ఘనుఁడుగద ! బోధిసత్త్వుఁడు;
మనేఁదా త్త్యాకుఁడయ్యు విడక మానవసేవల్. ౨౬౬

కం. వెలుపల, లోపల, సమగతి
వలయును బ్రహ్మానుభూతి వడయంగా, భా
సిలు పంచదారగోలీ
వెలుపల లోపలను నేకవిధి రుచిఁగోనమే ? ౨౬౭

కం. పరికింపరాక పరులకు
ధరణీగర్భంబునందుఁ దాఁగిన గని నా
నరుఁ డే గిరిగుహాయందో
నిరతంబు సమాధిలో మునింగిన ఫలమే ? ౨౬౮

గీ. పడయుదువు లెమ్మ ! నిర్వికల్పకసమాధి
నలఁతితడవుల ; నదియె లక్ష్యంబుగాదు ;
సగుణనిర్గుణముల నిట్లు సమరసముగ
జీవి యనుభూతినందుటే శ్రేష్ఠతరము." ౨౬౯

కం. అని తగ నుపదేశింపం
గ నరేంద్రుం డెట్లు నిర్వికల్పసమాధిన్
మునుఁగందలంచె నొకపరి;
ననయము గాలంబు వుచ్చె ధ్యానైకరతిన్ ౨౭౦

కం. ఒక దివసంబున నాక
స్మికంబుగా ధ్యాననిష్ఠ మెలఁగ నరేంద్రుం
డు కనంబడెఁ దలవెనుకల
నొకానొకటి దివ్యమైన జ్యోతి ఘనంబై. ౨౭౧

కం. క్రమముగఁ బెదపెద్దై యా
క్రమించె నాసాంద్రకాంతిరాశి; నరేంద్రుం
డమనస్కుండై యద్దా
న మజ్జనోన్మజ్జనము లొనర్చుచు నుండెన్ ౨౭౨

ఆ.వె. ఒక్కతూరి నఱచు; నొకతూరి నవ్వు; వే
ఱొక్కతూరి వెక్కి వెక్కి యేడ్చు;
ఆ నరేంద్రుఁ, డిట్టు లాఘూదశాంతర
ములను బొందెఁ బెద్ద ప్రొద్దుదాఁక. ౨౭౩

కం. అతఁ డొకదినమున "ధ్యాన
స్థితుండనైయున్న నన్ను స్పృశియింపు" మనన్
గుతుకమునఁ దోడిశిష్యుఁడు
కృతతత్కార్యుండుగాఁగ నేమందునికన్. ౨౭౪

మ. వడఁకెన్ వైద్యుతయంత్రమున్ గరమునన్
స్పర్శించినట్టుల్ గడు
న్గడు నాపాదశిఖంబుగా నొడలు; క
న్దమ్ముల్ పడెన్ మూఁత; ల

ప్పుడు బాహ్యస్మరణంబు మెల్ల మెలఁగాఁ
బోయెన్; సహాధ్యాయ శి
ష్యుఁడు ప్రాపించి సమాధినిష్ఠను సము
ద్యోతిల్లెఁ దత్తుల్యుఁడై. ౨౭౫

## ౧౦. రామకృష్ణ నిర్యాణము

కం. మొలకెత్తి రామకృష్ణుని
గళంబున వ్రణంబొకండు క్రమముగ గడ్డై
బలపడి, వాచి, కడుంగడు
నలోకసామాన్యమైన వ్యథ నిడుచుండెన్. ౨౭౬

ఆ. వె. తెఱువరాక నోరు, తినరాక యన్నంబు,
గుటకపడక కొలఁది క్రోలునీరు
నిద్రలే కతండు నీరసించియు మానఁ
బోక శిష్యతతికి బోధసేయు. ౨౭౭

ఆ. వె. పలుకఁబోయియాఁగుఁ; బలుకుచు సగములో
మ్రింగిమ్రింగి బాధమీఱి మానుఁ;
గఱపవలయు దానిఁ గనుదోయితోఁ, బెద్ద
మూల్గుతోడఁ, గఱపఁబూనెఁ దుదికి. ౨౭౮

మ. కనుసన్నంగొని రామకృష్ణుఁ దఱియం
గై మోడ్పుతో భక్తిమూ
ర్తి నరేంద్రుండు; దదేకదృష్టిఁ గనె నా
దివ్యర్షి చంద్రుండు; ఛా

త్రునిగాత్రంబున సూక్ష్మసూక్ష్మమగు నే
దోశ్శక్తి యీమాటకం
దని దొక్కుమ్మడిఁ జొచ్చె; వీడె నతఁడ
ద్దాసన్ స్వబాహ్యస్మృతిన్. ౨౬౯

కం. ఆతఁ డలఁతితడవులకుఁ బ్రా
కస్మృతిగొనె; దివ్యామృతంబు సేవించిన యు
ట్లతిమాత్రదర్శనీయ
ద్యుతితతిశోభం దదాస్యాంబుజ మలరెన్. ౨౭౦

మ. భగవానుండగు రామకృష్ణుఁ డతనిన్
బాష్పాయమానాక్షుఁడై
తగ వీక్షించుచు నిట్లు వల్కెను; "నరేం
ద్రా! అమ్మ నాసంచితం
బగు నాధ్యాత్మికశక్తు లన్నిటిని నీ
కై ధారవోయించి రి
క్తుఁగఁ జేసె న్నను; యావదాస్తియును నీ
కున్ సంక్రమించెం జుమీ! ౨౭౧

కం. విను! విశ్వశ్రేయోర్థము
వినియోగింపంగవలయు వీనిని జగ
జ్జననీచిత్తము; తుదిదీ
వన యిదే"యని యుంచెఁ గేలు వానితలపయిన్. ౨౭౨

కం. కనుచున్న యానరేంద్రుని
కనులన్ నీర్దిరిగెఁ; బలుకఁగా మాటయు నో
టను రాదయ్యెను; ముడిఁగెను;
వినయంబున శిరసువాంచి విరచించె నతుల్. ౨౮౩

గీ. రెండునాళ్లకు రామకృష్ణుఁడు దనదు
నాత్మలోఁ బంచభూతంబు లానరేంద్రు
నాత్మమునఁ బంచభూతంబులందుఁ జేర్చి
నట్టు లెల్లరుగన నదృశ్యత్వ మొందె. ౨౮౪

కం. గురుదేవు నస్థిపాత్రను;
గురుదేవునిమూర్తి నట్లు గొనివచ్చి గుణో
త్తరుఁడు నరేంద్రుం డొదల
ధరించి 'బేలూరు'నందు స్థాపనసేసెన్. ౨౮౫

కం. "గురుదేవుం డేగెను సూ
క్ష్మరూపమున లోకమెల్లఁ జరియింప జనో
ద్ధరణార్థం; బాతని స్థూ
లరూప మీయస్థిపాత్రలక్షణ మయ్యెన్." ౨౮౬

కం. అని సోదరశిష్యులఁ గని
"మనకిది పుణ్యస్థలంబు; మహామండలికిన్
ఘనమైనజ్ఞానకేంద్రము;
జనింత్రు కోటానకోట్లు జగదాప్తు లిటన్." ౨౮౭

గీ. అనిపలికి తోడిశిష్యాళి యనుసరింపఁ
బూని సన్న్యాసమును మంత్రపూర్వకముగ
నామఠమునందు జపతపోధ్యాననిష్ఠ
లాచరించుచునుండె నత్యంతదీక్ష. ౨౮౮

కం. అదిలేదని యిదిలేదని
మదినిం జింతిలక యాసమయమునఁ దమకై
య్యదిదొరకిన నదికుడుచుచు
సుదీర్ఘకాలము తపస్సుఁ జొక్కిరి వారల్. ౨౮౯

చ. అనయముఁ గోఁడికూఁతసమ
యంబున మేల్కొని దివ్యనామకీ
ర్తన మొనరించి స్నాతులయి
ప్రాహ్ణమునందుఁ దపంబునందు వా
ర్మునిఁగెడివారు; ప్రొద్దుపొడు
పు న్మొకనాఁడును బ్రొద్దుగ్రుంకుట
న్నరయ; రొకొక్కకప్పు డశ
నస్మృతిలేకయునుండి రత్తఱిన్. ౨౯౦

చ. అలఁదివిభూతి నాముఖప
దాంతము గాత్రమునందుఁ గావిచీ
రలుధరియించి కేల రుద
రాకలతావళముల్ వహించి మో

ములఁ దగ బ్రహ్మతేజము స
ముజ్జ్వలతఁ దపమాచరించు వా
రలలశివావతారముల
రమ్యతఁబొల్చిరికన్నవిందులై. ౨౯–౧

## ౧౧. పుణ్యక్షేత్ర సందర్శనము.

కం. క్షితి నాసేతుహిమాచల
గతపుణ్యక్షేత్రములను గనుఁగొని తత్ర
స్థితదివ్యర్షుల దర్శిం
చ తదనుగ్రహమునొంద స్థిరచిత్తుండై ౨౯–౨

గీ. తొడరి గోధేనువును లేఁగదూడలట్లు
దన్ను వెంటాడు తన సహాధ్యాయగణము
నెట్టులెట్టులో! విడి యానరేంద్రుఁ డచట
భిక్షువృత్తినిఁగొని యాదిభిక్షువనఁగ. ౨౯–౩

గీ. పృథివి సంసారసాగరద్వీపమైన
వారణాసినిఁగాంచి ప్రపథమమందు
మోక్షకాంక్షుల ముంగొంగు ముత్యమైన
విశ్వనాథునిఁ బెద్ద సేవించె భక్తి. ౨౯–౪

సీ. రామరాజ్య "మయోధ్యఁ" బ్రాపించె; దివ్యంబు
"బృందావనంబు" దర్శించుకొనియె
వలఁగొనెఁ బుణ్య" గోవర్ధన శైలంబు;
జనియె "రాధాకుండమునకు"ఁ బ్రీతిఁ

ప్రఖ్యాతమగు "హరిద్వారంబునకుఁ బోయె ;
నిలఁ గీర్త్యమగు "హృషీకేశ" మరిగెఁ
బరమపావనమైన "వైద్యనాథము"ఁ జేరె ;
"బదరికావన" మందు బసనొనర్చి
గీ. రహినిఁ "గర్ణప్రయాగ" "రుద్రప్రయాగ"
"శ్రీనగర" మన్న క్షేత్ర మీక్షించుకొనుచు
'వివిదిషానంద' నామంబుఁ బేర్మిఁ దాల్చి
యానరేంద్రుండు 'హస్తిన' కరుగుదెంచె. ౨౯౫

మ. భగవద్దర్శన మాచరించుకొనుచున్
భక్త్యున్నతిన్ బుణ్యని
మ్నగలన్ స్నానమొనర్చుచున్ సలుపుచున్
నానాతపశ్చర్యలన్
దగ దివ్యానుభవంబుఁ బొందుకొను చా
ర్తప్రాణి సంసేవయే
భగవత్సేవయటా మదిందలఁచుచుం
బైనించె దేశంబులన్. ౨౯౬

కం. నడచుచు నడచుచు నొకచో
బడలి తరుచ్ఛాయ సతఁడు పండెం జని యొ
క్కఁడు పీల్చుచున్న చిలుమును
నడిగెన్ ; వాఁడీక జరిగి యవ్వల కనియెన్. ౨౯౭

ఆ.వె. స్వామి ! అంటరానివాఁడను ; మీరలు
పుణ్యమూర్తులయిన భూసురులరు ;
కలుషమంటు నాదు చిలుముగొట్టము ముట్టఁ;
గడఁగియేని నద్ది కడుగరాదు." ౨౯౮

చ. అని పలుకన్ గ్రహింపకది
యాతఁడు గొంచెముదవ్వుపోయి నె
మ్మనమున "నీచరాచర స
మస్తమునన్ భగవత్స్వరూప మం
చనుకొని జాతిభేదముల
నంతముసేసియు సన్న్యసించియుం
గొన వెనుకాడితిం జిలుము
గొట్టమిసీ! యతినన్న సిగ్గుగన్. ౨౯౯

గీ. తరతరంబులనుండి చిత్తమునయందుఁ
బాఁతుకొని వేళ్లుదన్నెను వాసనాళి;
ఏతదున్మూలనంబు నెన్నెన్నొతూర్లు
సలిపినను జాక వెండియు మొలకలెత్తె." ౩౦౦

కం. అనితన్నుఁ దెగడికొంచును
వెనుకకు విచ్చేసి యీయవెనుకాడెడు మా
లని వేఁడి చిలుముగొట్టం
బును గైకొని కూరుచుండి పొగఁబీల్చ చనెన్. ౩౦౧

కం. చనుచుం జనుచు న్నొకపరిఁ
"దన కెది యీనాఁడయాచితముగ లభించుం
దినుదును దానిన"యని దీ
క్షనుగొని చనుచుండె నతఁడు గారడవిఁబడెన్. ౩౦౨

ఆ.వె. పెనమువోలె నేల బిట్టుఁగాలుచునుండె;
నిప్పుఁ జెరుగుచుండె నిగిడి గాలి;
దారిడొంక లేని తావున నెట్టెటో
దారిఁ జేసికొనుచు నతఁడు నడచు. ౩౦౩

ఆ.వె. మండుచుండెఁ గడుపు; నెండుచుండెను గొంతు;
బొబ్బలెక్కె కాళ్లు పుండువాఱె;
నడుగుదీసి యడుగునిడఁ జాలఁడయ్యెను;
నీడయేనిఁ దనకుఁ దోఁడు లేద. ౩౦౪

ఉ. అత్తఱి నాయతీశ్వరుఁడు
హత్తినబత్తిని రామకృష్ణునిం
జిత్తమునన్ స్మరించుచుఁ గృ
శించిన నాఁగ కసాఁగె; వృద్ధుఁడై
త్రెత్తి యెవండొ? "ఆఁగుము న
రేంద్ర! నరేంద్ర!" యటంచుఁ బిల్చుచున్
నెత్తినిమూఁటతోఁడ నత
నిం దఱియుంజని పల్కె నివ్విధిన్. ౩౦౫

కం. "ఆఁకొన్నాఁడవు పాపము!
ఈకూటినిఁ గుడిచి, క్రోలి యీచన్నీటిన్,
జేకొనితగు విశ్రాంతిని
నేకడకేనియును బిదపనేఁగుము తండ్రీ!" ౩౦౬

కం. అని మాటనొసఁగి "నాకత
వినుతును బిమ్మటను; ముందు వేగఁగొనుము! భో
జన; మింతలోనవచ్చెద"
నని క్రమ్మఱ రాకయేఁగె నాతం డెటకో! ౩౦౭

కం. అమృతంబు నారగించిన
క్రమంబున నరేంద్రుఁ డపుడు గజబలుఁడై చి
త్తమునందు రామకృష్ణ మ
హిమంబుఁ గొండాడుకొంచు నేఁగెను బైకిన్. ౩౦౮

ఆ.వె. ఆఱవయిచి తీరమందుఁ గౌపీనంబు
స్నానమాడ నొకట నది మునింగె;
లేచిచూచుసరికి లేదయ్యెనయ్యది;
యపహరించె దానిఁ గపియొకండు. ౩౧౯

కం. తలపాగా రచియించును;
వలెవాటుగఁ దాల్చు బుజముపైకి; మెడను దా
వళమట్లు వ్రేల్చుఁ; జుట్టును
మొల; కీయక యాతఁ డెంత మ్రొక్కుచునున్నన్. ౩౧౦

కం. కడ కతఁడు విసివి కొనలఁ
బడి నిరశనవృత్తిఁబూని పయనమయి చనన్
నడిబాట నతనికంటం
బడె నాకౌపీన; మెట్లువచ్చెనో? యటకున్. ౩౧౧

గీ. ఆతఁ డుత్తరదిశ నమ్మహాహిమాద్రి
యాత్రలుముగించి పొంది దివ్యానుభూతిఁ ;
బూర్ణయాత్రనుగావింప బుద్ధిపొడమి
పయనమయ్యెను దక్షిణాపథమునకును. ౩౧౨

విగ్రహారాధనము (౧

ఆ.వె. నిగురుగప్పినట్టి నిప్పుచందంబునఁ,
బడగముడిఁచికొన్న పామువోలెఁ,
గావిపుట్టములను గట్టి క్రమ్మఱి గుప్త
తేజుఁడతఁడు దేశదేశములను. ౩౧౩

గీ. సురఝురము పిచ్చుగుంటును దరిసినట్లు
జంగమంబైన తీర్థ మాస్వామి పూజ్య
పాదుఁడు నరేంద్రుఁ డరిగెఁ దత్ప్రభునిపుణ్య
భూతి నాళ్వారుసంస్థానమునకు నంత. ౩౧౪

గీ. ఆపురీవీథి విచ్చేయు నతనిఁగాంచి
బింబిసారుని పురరథ్య వెడలుచున్న
బుద్ధదేవుని స్మరియించి పూర్ణభక్తిఁ
బూజసేసిరి కరపద్మములను బ్రజలు. ౩౧౫

కం. కనుఁగొని మఠమొక్కం డం
దునికినిఁగొనియుండె నొక్కరొక్కరె తద్ద
ర్శనమునఁ గృతార్థతంగొన
ననిశం బరుదెంచుచుండి రా యతికడకున్. ౩౧౬

సీ. వ్యాఖ్యాన మొనరించు నరఁటిపండొల్చిన
ట్లుపనిషదరహస్యములు విప్పి;
పరవశుండయిచేయు భజనలు పాడుచుఁ
జైతన్యముఖభక్తజనుల పాట;
లతిలోకగతి నుపన్యసియించుఁ దా శ్రుతి
స్మృతిపురాణైకవాక్యతఘటించి;
గాలించిపైకెత్తుఁ గ్రైస్తవ మ్లేచ్ఛుల
సిద్ధాంతములలోని చేవయెల్ల;
గీ. రామకృష్ణునిమహిమ వర్ణనముసేయు;
సకలమతముల సామరస్యమును జాటు;
స్వానుభూతి నివేదించు నాయతీంద్రుఁ
డెల్లజను లుల్లమందు సముల్లసిల్ల. ౩౧౭

కం. ఒకఁడే దైవము ప్రాప్యం;
బొకటే వర్ణంబు; జాతియొకటే; సర్వం
బొకటె; యని "నేహ నానా
స్తి కించన" యటన్న శ్రుతి నదికె నతఁ డెడకున్. ౩౧౮

శా. ఆకారంబున మీనకేతనుఁడు, వి
ద్యారాశి వాగ్దేవి, ప్ర
జ్ఞాకౌశల్యమునందు గీష్పతి, సమం
చద్గీతరాగంబునన్
బై కాఁ గేసరుఁ; డాంగ్లవాక్ఛ్రేణులలోఁ
బ్రాచార్యవర్యుం; డెసం
డాకర్షింపఁబడండు వాని సదుప
న్యాసంబు నాలించినన్ ? 3౧౯

సీ. మురళీధరుని గానమును విని ముగ్ధలై
వివశలై పఱతెంచు వ్రేఁతలట్లు
వత్సభూపతి ఘోషవతిహృద్యగీతికిఁ
జెవులూఁడు మదగజశ్రేణులట్లు
అలమహాశ్వేత వీణారావ మాలించి
క్రేళ్ళుబాఁటుచుఁ బాఱు లేళ్ళులట్లు
అహితుండికుని శ్రావ్యమైనట్టి నాగస్వ
రమునఁ బైకుఱుకు సర్పంబులట్లు
గీ. వరనరేంద్రుని ధార్మికప్రవచనంపు
వార్త నాత్మక్రియాకలాపములు మఱచి
జనులు తండోపతండముల్ వెనుదిరుగక
యెండనక వాననాక, వత్తెల్లతఱుల 3౨౦

గీ. ఇక్షుఖండంబు ముసిరెడు నీఁగలట్లు
సురభిళసుమంబు మూఁగు బంభరములట్లు
ఆ మహాత్మునిఁ జుట్టి యహర్దివంబుఁ
గ్రోలుచుండిరి వాని వాక్సుధలు జనులు. 3_౨౧

శా. ఆయాళ్వారు ధరాధినాథుని యమా
త్యాగ్య్రుండు దివ్యర్షి దే
శీయుణ్ స్వామిని విన్న స్వప్రభుని నా
స్తిక్యంబు నిర్మూలమై
శ్రేయంబొందునటంచు నెంచి, కొనితె
చ్చెణ్ స్వామి దర్శింపఁగా
నా యుర్వీపతి వచ్చి జోతలిడి
మర్యాదణ్ విడంబించుచుణ్. 3_౨౨

కం. "మీరలు లెస్సగఁ జదివిన
వారఁట; మీచేయరాని పనియుండదు; యీ
తీరునను నీచయాచనఁ
బ్రారంభించితిరి గౌరవంబడుగంటణ్ 3_౨౩

గీ. కావు గ్రుడ్డివి; కుంటివిగావు నీవు;
మల్లమర్తాండునట్లుండి మాన ముజ్జ
గించి క్రిమ్ముఱుదని యేవగించుకొనరె!
కాయకష్టంబుచే బ్రదుకంగరాదె? 3_౨౪

గీ. ఈయమాయికలోకంబు నిక్కుగాని
మోసపుచ్చంగరాదంచుఁ బూనుచుండ్రు
పలువు రాషాఢభూతులు; వారివంటి
వార లోకవేళఁ గాకపోవచ్చు మీరు."

ఆ.వె. అనుచుఁ గడుసువాఁ డేసట్టి నిర్లక్ష్యభా
వమునఁ దన్నెదిర్చిపలుక నెవఁడు
సాహసించునంచు సరవి దేవానాంప్రి
యుండు నలికెఁ గొదుకకుండ లవము.

మ. యతి యాలించి తదీయవాక్య మనె "రా
జా! ముందువాక్రువ్వు; మా
తత మోహంబున రాజ్యనిర్వహణాతం
ద్రాఖండవై భోగినీ
తతితోఁ ద్రాగుచు నాడు చెందుకుఁ బ్రజా
ద్రవ్యంబు వెచ్చింతువో ?
మతిమంతుండవు; కాయకష్టమున సం
పాదించితే యీసిరిన్ ?

కం. అని వెనుకాడక పలుకఁగఁ
జనులందఱు చూచి స్వామిసాహసమును ద
మ్మును గోపగించునో రేఁ
డనుకొని చేష్టుడిగియుండ యతి కాతఁడనెన్.

కం. " నాయిష్టంబది; పరులు మ
దీయచరిత్రంబుఁగార్చి యేలతడవ ? నా
శ్రేయస్కర మెదో! యెఱుఁగుదు "
నా యతియనె నాజవాబు నదియే నీకున్ ౩౨౯

మ. నినుయాచింపఁగరాను; నీవలనఁ గా
నిన్నేనిఁగైకోను బో !
తృణమున్ మేరునగరంబు నాకు నౌకరీ
తిందోఁచు; సన్న్యాసి; ధా
త్రి నినుంబోలిన మత్తచిత్తులకు బో
ధింపంగ గుర్వాజ్ఞఁగై
కొని సంచార మొనర్తుఁ; గాయసుఖముల్
కోరంజుమీ! నీవలెన్ ౩౩౦

ఆ.వె. అత్తచేయుదాని కారళ్లు లేవు; పా
తకము లేదు పెద్దతలలకండ్రు;
నిన్నెదర్చి పలుకనేరమి నీప్రజ
సాఁగుచుండె నీదు నాగడంబు. ౩౩౧

కం. ఓయీ! రంధ్రాన్వేషము
సేయకు; నేపుట్ట నెట్టిచిలువగలదో? క
ట్టా! యదిబుస్సని లేచిన
దూయంగావలయుఁ గాలు దుందుడుకుమెయిన్." ౩౩౨

కం. అని కోపంబును హాస్యం
బును సమముగ నేళవించి బుధవరుఁ డాడన్
జనపతి ముడింగి తెలివిగ
క్షణమూరకయుండి తత్ప్రసంగముమార్చెన్. ౩౩౩

గీ. "స్వామిజీ! కాదెమహార్ఘ్యంబు? ప్రాణహీనాస్య
విగ్రహంబులఁ బూజఁగావించుక్రమము;
క్రైస్తవమహమ్మదీయు లీకరణి విగ్ర
హప్రతిష్ఠార్చనములు సేయర నిజంబు. ౩౩౪

శా. ఓతప్రోతముగా జగంబలమి తా
నొప్పార నీశుండిలన్
రాతిన్ రప్పను గట్టెఁగట్టను సమా
రాధించు నేలా? జన
వ్రాతం బెట్టిలు? మ్రొక్కఁ బుణ్యాసతి వి
శ్వస్తం, దనుం బోలుచుం
బ్రాఁతిన్ వస్త్రెల్లుమన్నరీతి ఫలలా
భంబౌఁగదా! వారికిన్. ౩౩౫

గీ. అనవుడు నరేంద్రుఁ "డితనికి నాణెఁదాకు
బోధఁగావింతు" ననుకొని ముందుసూచి
గోడపయి వ్రేలుచున్న యాక్షోణినాథు
చిత్రపటమును దెప్పించి చేతఁదాల్చి. ౩౩౬

గీ. సేవకులఁబిల్చి "మీరు నిష్ఠీవనంబు
సేయుఁడీ కాగితపుబొమ్మఁ; జేయు కిట్టు
లొండొరులమోములను జూచుచుంటి రేల?
కొదుకకొందురేల? మదినేల గొణుగుకొందురు? ౩౩౮

గీ. దీననున్నాఁడు మీధరాధీశ్వరుఁడని
తటపటాయించుచుంటి; రాధరణివిభుని
స్వస్వరూపంబుగాదిది; ప్రాణహీన ;
మిందు నుమియంగఁ బిర్వీఁకదేల మీకు? ౩౩౯

చ. అనవెఱఁగంది పెగ్గడ "మ
హాత్మ నరేంద్రునిఁ దన్ను జేఁడఁ మ
న్వెనుకలుసూడ కల్కమెయి
బెట్టిదముల్ పలుకాడు నేమొ! దు
ర్వినయమొనర్చు నేమొ!" యని
భీతివడంకు "చిదేమి! స్వామి ! మా
జనపతిపూజ్యచిత్రమును
జన్నెపొనర్పగదూష్య మీక్రియః ?

కం. "నావిష్ణుః పృథివీపతి"
నా వినుచున్నాము; భూమినాథుని చిత్రం
బావిష్ణుచిత్రమేకద!
దేవర! పాపక్రియోపదేశ ముచితమే?" ౩౪౦

మ. పలుకంగానిటు లాయమీంద్రుఁ డనియెన్
"ద్వద్రాజచిత్రం బిటన్
మలినీభూత మొనర్ప మైలపడునే
క్ష్మాజాని? దూషించు మి
మ్మలుకంజూచునె? చంపవచ్చునె? త్వదీ
యస్తోత్రముల్ కాని పూ
జలుగానీ కొని సంతసంపడిన యా
చందంబు మున్గంటిరే? ౩౮౧

ఆ.వె. రాతివిగ్రహమునఁ బ్రాణంబు లేనట్లె
చిత్రమునకు లేదు జీవితంబు;
అయిన మీరు దానినర్చింత్రు భక్తిప్ర
పత్తులలర" నంచుఁ బ్రభువుఁగాంచి. ౩౮౨

శా. "రాజా! చూడుము! నీదు సేవకులు చి
త్రంబున్ విలోకించి నిన్
బూజల్ సేసినయట్లె చేయుదు; రొక
ప్పున్ దానినిర్జీవపున్
నైజంబెన్నరు; దానికెట్టియవమా
నంబున్ సహింపంగఁబో;
ర్వ్యాజైనంబడనీక కాతు రనయం
బుం ద్వత్ప్రగోష్ఠంబునన్. ౩౮౩

గీ. విగ్రహంబులఁ బూజఁగావించువార
లీశ్వరుప్రతీకమని దాని నెంచుకొంద్రు
దానికర్పించునర్చలు "దైవతంబు
స్వీకరించున"యని విశ్వసించుచుంద్రు ౩౮౪

కం. ఓతప్రోతముగ సమా
మ్నాతుండగు నీశ్వరుండు నానాప్రతిమా
వ్రాతమున నేలయుండం?
డాతనియర్చనమె విగ్రహారాధనగాఁ. ౩౮౫

కం. ఏరూపముతోడ నలం
కారంబులుగానఁబడ్డఁ గాంచనమొకటే!
ఏరూపునఁదోఁచిన వే
ల్వాఁడయి యీశ్వరుండొకండె విగ్రహములలోఁ. ౩౮౬

కం. "ఎవరేగతి భావించిన
నవ్వదును ప్రాప్యముగ వారికారూపముతో
భువి"నంచును భగవంతుం
డు వచించెనుగీత నర్జునున కిదివినవో! ౩౮౭

కం. ప్రవచింపఁగ నివ్విధమున
నవనీనాథుఁడు కరద్వయముమోడిచి "నా
యవివేకము మన్నింపుము!
తవిలితిఁబాశ్చాత్యమోహతంతువులందుఁ. ౩౮౮

కం. జనుషాంధుఁడనగు నాదగు
కనుఁగవఁదెఱచితివి; స్వామి ! కాపుంచిన నే
మునిఁగెడివాఁడను బాపా
బ్ధిని; నీ యీ ఋణము నెట్లుదీర్చఁగల నిఁకన్

కం. అని చరణంబుల వ్రాలఁగఁ
దనదర్పము కరఁగి, యతియుఁ దలఁగేలిడి యా
జనపతితోఁ "మన్నించుము
నిను భగవంతుండే యాతనిం గొలువు"మనెన్

టూరీఘాట్ స్టేషను ౨.

కం. కానీ లేకయుఁ గరమున
నానాయాత్రిలసతం డొనర్చు చొకతఱిన్
బూనికిని రాజపుత్ర
స్థానమునఁ బ్రయాణకంబు సలుపుచునుండెన్.

కం. మలమలమాడ్చుచుఁ బెనువుం
గలముకరణి నేలనెల్లఁ, గడు వేఁచుచుఁ బ్రా
ణులఁ బేలగింజలను వలెఁ
జెలరేఁగ నిదాఘమంతఁ జెరగుచు నిప్పాల్.

కం. వడఁదాకి యెండిగొంతులు
పుడమింబడెఁ బెక్కుజంతువులు గనుఁగొని స
ల్లడల మరీచికలను జల
తడాగములటంచు బ్రమసి తఱియఁబఱచుచున్

కం. సురగాలి దుమారంబును
గరమరుదుగ రేఁపి నాసికాకర్ణములం
జొరఁగా నుక్కిరి బిక్కిరి
పఱచుచుఁ గలఁచెం బ్రయాణపరులను రథ్యన్. ౩౨౪

గీ. అట్టి వేసంగి మట్టమధ్యాహ్నమందు
స్వామి పయనించు చోకనాఁడు ధూమశకటి
'టారిఘాట్టున'డిగి నిరాహారుఁడగుట
డీలువడియుండెఁ గాల్దీయఁజాలకుండె. ౩౨౫

గీ. పంచపాత్రెఁడునీ ర్విక్రయించుచుండి
రొకయణా వెల; కాస్వామినికటమందు
నెత్తినేగాని లేద; నోరెండుచుండె
నుస్సురనుకొంచు నందాతఁ డొరిగెనేల. ౩౨౬

గీ. వచ్చి యమకింకరునిఁబోని భటుఁ డొకండు
'వలదుపండంగనిటు' నంచు వెలలనడఁచె
సదనముంగాచు నీచంపుశ్వాన మదియె
దొరనటంచును దర్పంబుతో మొఱుంగు. ౩౨౭

గీ. విస్ఫులింగంబులట్టులు బెట్టిదముగ
మండుచుండినరాళ్లతో నిండియున్న
బయలునం గూరుచుండె నాభవ్యతముఁడు
పండునిప్పులకొలిమిఁ గూర్చుండినట్లు ౩౨౮

గీ. స్వామిసామీప్యమునఁ దరుచ్ఛాయయందుఁ
బురుషుఁ డొకరుండు గూర్చుండి మూటవిప్పి
భోజ్యములనారగించు చంబువులఁ గ్రోలి
త్రేన్చుకొంచును స్వామిదెసకుఁ జూచి ౩౫౯

గీ. "తిండియుం దీర్థమును లేక యెండియెండి
యుగిరిచచ్చుటె కాఁబోలు! నీయతులకుఁ
బ్రాప్యమగుమోక్ష మం"చు నప్రాజ్ఞతముఁడు
కృపణుఁ డొనరించె బిట్టవహేళనంబు. ౩౬౦

గీ. క్షుత్పిపాసార్తికిం దోడు క్షుద్రభటుని
ఘూర్తవర్తన, దానికిఁ దోడు మెండు
మందుభువి, వీని లెక్కింపకుండు నాతఁ
డీ యధమువహేళనంబు లక్ష్యించునొక్కొ? ౩౬౧

ఆ.వె. "నడుమువంచి కష్టపడి కూలిసేసినఁ
గడుపునిండఁగూడుఁ గుడుతువుగద !
జోగివేసమూని సోమరిపోతవై
తిండిలేక చచ్చుచుందె దేల ?" ౩౬౨

కం. అని మరియుఁ దెగడఁగా దూ
షణభూషణాధిక్రియావిజయిగావుట నా
ఘునుఁ డూరకుండె వినుచున్;
శునకము మొఱుఁగంగ నేన్గు క్షోభిల్లు నొకో! ౩౬౩

మ. అలభక్ష్యంబులు, భోజ్యచోష్యములు, లే
హ్యంబుల్ కడుం బేయముల్
గలపళ్యంబు శిరంబునందునిచి యొ
క్కండెవ్వఁడో ? యెల్లది
క్కులు వీక్షించుచు వచ్చి స్వామికడకున్
గుర్తించి పెన్‌బత్తి సాఁ
గిలి చిత్రాసనమున్ భువింబఱచి ని
క్షేపించి యాపళ్లెమున్. ౩౬౪

ఉ. "స్వామి యనుగ్రహించి నను,
సాపడుఁ"డంచును దోసిలొగ్గఁగా
నామహనీయుఁ డద్భుతము
నందుచు "భద్రి! యెవండవీవు? ని
న్నె మునుజూచియుండ; నను
నెవ్వరిగా భ్రమియించినావొ? యీ
గ్రామము కేనుగ్రొత్తసుమి!
కావునఁ బో"మ్మన నాతఁ డిట్లనెన్.

శా. "దేవా! నేను మిఠాయివర్తకుఁడ; రా
త్రిన్ నాకుస్వప్నంబులో
దేవోత్తంసుఁడు రామచంద్రుఁడు దయో
త్సేకుండు ప్రత్యక్షుఁడై

ఏవంరూపుని నిన్నుఁగన్పఱిచి "నా
యీభక్తునిఁ దృప్తిపా
నాన్నైవేద్య భుజింపఁజేయు"మని యా
జ్ఞాపించిపోయెఁ ననున్ ౩౬౬

కం. కల కల్లగదా! యనుకొని
చలింపక శయింప మరల స్వప్నమువచ్చెన్
దొలివలెనె; బద్ధకించితి
మెలఁకువగొని; యెవఁడొ? కేల మొయిఁదట్టె ననున్ ౩౬౭

గీ. భగవదాదేశమిప్పుడది వాస్తవముగ
దాఁటరాదంచుఁ గైమోడ్చి తానమాడి
దాల్చిధౌతంబు వండి పదార్థములను
దెచ్చితి; భుజించి ననుఁబ్రసాదింపుఁడయ్య! ౩౬౮

గీ. అనుచు బ్రతిమాలఁగా స్వామి యాలకించి
రామచంద్రుని దివ్యదర్శనముకలిమి
ధన్యుఁడగు వానినిం దాఁకి తలఁచి తన్ను
ధన్యునిగ నారగించెఁ బదార్థమెల్ల. ౩౬౯

ఆ.వె. అవిరతంబుఁద న్ననన్యభక్తినిఁగొల్చు
భక్తకోటి కొంగుఁబసిఁడియగుచు
నేడుగడయునగుచు నెపుడు యోగక్షేమ
మరయుచుండు దైవ మనఁగవినమె? ౩౭౦

కం. ఈదృశ్యంబును గాంచుచు
నాదిక్కున నిలిచియున్న యామూర్ఖుఁ డెదం
బ్రాదుర్భూతవివేకుం
డై "దోసము సైఁపు"మని తదంఘ్రుల వ్రాలెన్. ౩౨౧

## క్షేత్రీనగరము. ౩

ఆ.వె. యాత్ర సేయుచాతఁ డాదేశమందున్న
క్షేత్రినగరమున వసించెఁ; బ్రజలు
దినదినంబుఁ దదుపదేశార్థ మరుదెంత్రు
పండ్లగంపకడకుఁ బఱచునట్లు ౩౨౨

గీ. కంచుగీసినగతి వానిగళము మ్రోఁగు;
నన్ని వేళల శ్రోత్రపేయముగఁ బాడు
చిలుకు బుంభావభారతి యాతఁ డనఁగ
సంతతము ధర్మబోధలు సలుపుచుండు. ౩౨౩

ఆ.వె. మంత్రబద్ధులట్లు మాటాడ రెవ్వరుఁ
గదలిపోరు; వానికడ నెయుండు;
ఇద్ది నిద్రవేళ, యిద్ది భోజనవేళ,
యిద్ది స్నానవేళ యేని ననక. ౩౨౪

ఆ.వె. అరుగుదెంచువారియం దొక్కరుండేని
స్వామిభిక్షుఁ గూర్చి పలుకఁడయ్యెఁ;
జద్దితిన్నపడఁతి స్వపతియాఁకలిఁ గూర్చి
యెఱుఁగఁ దన్నమాట సరిపడంగ. ౩౨౫

గీ. చర్మకరుఁడొక్కఁ డీరహస్యం బెఱింగి
స్వామిదర్శించి తనజాతి స్పష్టపఱచి
"వంటఁ జేయింతు బ్రాహ్మణప్రసరుచేత
భిక్షఁగైకొండు! నాకుఁదృప్తిగ" నటంచు 32౬

మ. బ్రతిమాలంగ యతీశ్వరుండనియె "స
ర్వంఖల్విదంబ్రహ్మ"యన్
శ్రుతిబోధించు "చితండుపంచముఁడు; వి
ప్రుండీతఁ" డన్ భేదమున్
మతిఁబాటింతునె? నీవ సండికొనుసి తే
మ్మా! శంకలందక్క"యుం
చతఁడర్పించిన మైలకూడుదినె; బ్ర
హ్మజ్ఞుం డమూదృశుఁడే! 322

కం. ఎఱుఁగంగవచ్చె క్షేత్రీ
పురపతి కాస్వామిఁగూర్చి; పోయియతని నా
దరపూర్వంబుగ వేలుపుఁ
గరణిం దోడ్తెచ్చి పూజఁగావించెఁ గడున్. 32౮

ఆ.వె. అడుగులొత్తె; నుదికియాఱవైచెను శాటి;
స్వయముమోసి తెచ్చి పఱచెఁబాన్పు;
మహితభక్తిఁ దక్కమండలువుం దోమెఁ;
దోడిగెఁబాదుకలను బుడమితేఁడు. 32౯

ఆ.వె. భర్తమించిభార్య; భార్యను దా మించి
భర్త స్వామిఁ గట్టి భక్తితోడ
నహరహంబుగొలుచు చాతని యుపదేశ
మమృతరసమునట్టు లానుకొనిరి. ౩౬౦

ఆ.వె. స్వామి మెచ్చి వారిభక్తికి నారాజు
వాంఛితం బెఱింగి పాణిపద్మ
మతనిసిరసుపైని నాన్చి "పుత్రోదయ
ప్రాప్తిర" స్తటంచు వరమొసంగె. ౩౬౧

గీ. "వివిదిషానందుఁ"డామహీవిభునిప్రార్థ
నమునఁ దా'వివేకానంద"నామమొందె;
నామరూపంబులప్రధానంబులైనఁ
గోవిదులు భక్తహృత్ప్రీతిఁ గూర్తురిట్లు. ౩౬౨

కం. చనుచుండ నొక్కపరిఁ గా
ననమునఁ బులియొక్కఁ డాయనకు నెదురయ్యెన్
అనుకొనెనొ ? "నచ్చెఁబుట్ట"ని
చనియెం బెడదారి నతనిచక్కం గనుచున్. ౩౬౩

ఆ.వె. "శివునియాజ్ఞ లేక చీమేనిఁగుట్టద"
టన్నసూక్తి సత్యమక్షరాల;
నరునిఁగాంచి మీఁది కుఱుకక వ్యాఘ్రంబు
పరుగువాఱెనన్న నరిదియొక్కొ ? ౩౬౪

ఆ. వె. జయపురంబు, నాబుశైల, లిమ్డీ, భూజ
నగరపుణ్యపత్తన, మహిశూర,
కొచ్చిదేశములను గోర్కెమైఁగనుచు రా
మేశ్వరమున కాతఁ డేఁగెఁ బిదప. ౩౮౫

దక్షిణయాత్రలు ౪.

మ. తొలిజన్మంబులపాపముల్ కడుగు సే
తుస్నానముం జేసి, బి
ట్టెలమిన్ సైకతలింగదైవతము, రా
మేశాఖ్య, మాజానకీ
లలనాప్రాణపతిప్రతిష్ఠిత, మన
ల్పంబైనభక్తిన్ సమ
ర్చలుగావించి యతీశ్వరోత్తముఁ డెదం
బ్రాపించెఁ బెన్ హర్షమున్ ౩౮౬

ఆ. వె. కడలికరుడులేఁది 'కన్యాకుమార్యగ'
మునకు నచటు గదలిపోయె నతఁడు;
సరవి దుస్తరంపు సంసారసాగరం
బీఁదినట్టిఁ డేది యీఁదలేఁడు ? ౩౮౭

ఆ. వె. ఆతఁ డమ్మవారి నర్చించి యచ్చటి
జలధితీరగండశిల వసించి
తనకు దారినడుమ ననుభూతమగు లోక
వృత్తమును స్మరించి యిట్లనుకొనె. ౩౮౮

చ. చిలుకలవోలె శాస్త్రము వ
  చించినపల్కులె యెల్లకాలముం
 బలుకుచు స్వానుభూతి యణు
  మాత్రముఁగానక తారు పట్టుకుం
 దెలునకు మూఁడుకాళ్ళని ప
  దిం బదిగాఁ బిడివాదమాడు మూ
 ర్ఖులగు మతాధికారులఁట !
  రోఁతగదా! మతధర్మరక్షకుల్. ౩౮౯

మ. అడుగంటెన్ మనభారతీయమగు వి
  ద్యల్; పుచ్చిపోయెన్ గడు
 న్గడుధర్మంబును; వేషభాషణములున్
  బాశ్చాత్యలోకంపుఁ బో
 కడలన్ మైలవడెన్; సమస్తజనల
  క్ష్యం బర్థకామంబులై
 పెడదారింబడె; బూతిగంధియయి యీ
  విశ్వం బిసీ! కన్పడున్. ౩౯౦

మ. తినఁగా మూఁగుచు నెంగిలాకులపయిన్,
  దీర్పంగఁ బెన్దప్పినిం
 జనుచున్ సీ! గవులూఱుగుంటలకు, వృ
  క్షచ్ఛాయలంబండు చెం

డను వానన్, మొయిఁజింకిపోఁతలను మా
నంబెట్లొ ! రక్షించుకొం
చును జీవించెడిపేదలం గనఁగఁ జిం
చుందుఃఖ మీఱెందమున్. ౩౯౧

గీ. సప్తభూమికమైన ప్రాసాదములును,
పంచభక్ష్యాన్నములు, జిల్గువలువపిండుఁ,
గడిఁదిసిరిసంపదలుగల్గి యుడరువార
లెఱుఁగఁబోవర వీరు సోదరులటంచు. ౩౯౨

సీ. ముక్కారుఁబండుభూములు పచ్చగడ్డియు
మొలవని చవిటిపఱ్ఱలుగ మాఱెఁ;
ప్రాణికోటులకు జీవనమిచ్చుచునుండు
వారిదశ్రేణులు వట్టిపోయె;
బండ్లకొలంది నెప్పట్లఁబండులనీను
చెట్లు మొత్తంబుల చేవదగ్గెఁ;
బిదికినఁగడవల పెచ్చుగాఁబాలిచ్చు
నెల్లయాలపొదుంగు లెండిపోయె;

గీ. నోషధులశక్తియుడుగంబె నూచముట్టు;
దీసె విజ్ఞానవాహిని తేమమిగుల;
నానవాలునుగాన్పింప కాఱిపోయె
బొత్తిగా దేహబలరేఖ భూజనులకు ౩౯౩

గీ. అక్షరాస్యులు నూట దశాంశముండి;
రుండె వేయింట మెఱియ యొక్కఁడుమాత్ర;
గలఁడు గండరగండఁ డొకండు కోటి;
భరతఖండంబు క్షయరోగిపగిది నుండె. ౩౯౪

మ. ఘనశిల్పంబుల,ఁ దత్త్వశాస్త్రమున, సం
ఖ్యాశాస్త్రమందున్, రసా
యనతంత్రంబున భూఖగోళముల, నై
ద్యంబందు, నిట్లన్నిటన్
గనె లోకోన్నతి భారతంబు మును; లో
కాలోకముల్ దాటిపో
యెను దత్కీర్తి; యదృష్టరేఖ యిపు డి
స్సీ! మాసిపోయెం గదా! ౩౯౫

గీ. తమకు సేవకు వలసినంతగనె యలఁతి
యలఁతివిద్యల నేర్పింతు రాంగ్లవిభులు;
"మాటలకుఁగన్నతల్లియు మాఱుదల్లి
పెట్టున" కటన్నగతిఁ గానిపింత్రు వారు. ౩౯౬

శా. చాలున్ మూలయు లేని
సాంఘికదురాచారంబులే యయ్యెఁబో
మేలుంబంతులు జాతిక భగతభూ
మిం; దత్ప్రోవృద్ధికిన్

ఆలోచింపఁగ వేరుపుర్వులు మతా
ధ్యక్షుల్ ; పురోధోగణం
బేలా ! పెక్కులు ? దయ్యముల్ కరణి నెం
తేఁ బట్టి పల్లార్చెడిన్. ౩౯౭

గీ. నఖశిఖాంతంబు మార్చె హైందవునెల్లఁ,
బ్రాఁకె పాశ్చాత్యసభ్యత వ్యాధివోలెఁ ;
పారమార్థికదృష్టి కోల్పడెను; దానఁ
స్వార్థచింత విశేషించె నవధిఁగడచి ౩౯౮

గీ. స్వస్వరూపంబు మఱచిరి భారతీయు
లకట ! యాత్మస్వరూప మస్థిరమంచుఁ
దృప్తులయిరి పాశ్చాత్యు లీయిరువురికిని
గనులు దెఱపింపవలెఁ గలికమును వేసి ౩౯౯

కం. అన్నట్లు స్మృతికివచ్చెను ;
మొన్న "అమెరికా"ఖ్య దేశమునను "షికాగో"
యన్నగరిఁ బ్రపంచమతస
భన్నడిపింతురని వింటిఁ బత్రికవల్లన్. ౪౦౦

మ. అదిగో ! సాగరుఁ డూర్మిహస్తముల
నాహ్వానించుచుండెం బ్రతీ
చ్యదిశాయాత్రకు నన్ను ; విశ్వమతస
భ్యశ్రేణిలో రామకృ

స్థాపయఁ భారతధర్మదుందుభి నభి
ష్టుత్యంబు మ్రోగించి ప్రతి
ష్ఠమ నానాఁటికి నాగరసంస్కృతికిఁ ను
ద్బోధించి హిందువులఁ. ౪౦౧

గీ. చిల్లిగవ్వైనయును నాదు చెంత లేద ;
అమెరికా దేశమున కెట్టు లరుగఁగలను ?
బిలిచె రత్నాకరుఁడు నన్ను వెఱపదేల ?
కలదునా తల్లియగు రత్నగర్భ మరియు." ౪౦౨

గీ. అనుకొని ముగించుకొని తీర్థయాత్ర నంతఁ
జెన్నపత్తనమునకుఁ విచ్చేసె నతఁడు ;
తరణి దర్శనమునకయి తమ్ములట్లు
తనుఁ బ్రతీక్షించు ప్రజల సంతసము పఱుప. ౪౦౩

గీ. అపరశంకరుఁడని పండితాళి పలికెఁ ;
పామరగణంబు "పైల్వానుస్వామి" యనియె ;
యౌవతము "మన్మథస్వామి" యనుచుఁ బొగడె;
వాని విద్యాబలాంగసంపదలు గాంచి. ౪౦౪

కం. అమృతంపుజల్లు పగిదిని,
హిమాంబుపూరంబు కరణి, నేతదుపన్యా
సము కంఠమాధురియు, వా
క్చమత్కృతియుఁ గలిగి తద్ద శ్లాఘ్యంబయ్యెఁ. ౪౦౫

కం. "తెలిసియుఁ దెలియ కహర్నిశ
ముల సలుపు సమస్తపాపములఁ దొలఁగింపన్
దలపుము! రేపును మాపును
నలసతఁ గ్రమముం ద్యజింప కాపరమేశున్. ౨౦౬

కం. కొనిపోవుఁ బ్రాచ్యసభ్యత;
జనుధర్మాశ్రయత నీశసన్నిధి; కనుపున్
వెనుకకుఁ బ్రతీచ్యసభ్యత
ఘనార్థకామైకబద్ధ గావుట సతమున్. ౨౦౭

గీ. శ్రీపరాత్పరుసాక్షాత్కరించుకొనఁగఁ
దివిరి దగ్గఱిదారినిఁ దెలుపునట్టి
మతమె యత్యుత్తమంబైనమతము సుమ్మ!
అనుసరింపుము! తద్ధర్మమును గ్రహించి. ౨౦౮

గీ. కడుపుఁ జంకకుఁ దగిలించి పుడమినాల్గు
చెఱఁగులందు యథేచ్ఛఁ గ్రుమ్మఱుము; కాని
వేషభాషాప్రవర్తనల్ వీడకోయి!
వీడెదే మానవత్వంబె వీడు నిన్ను. ౨౦౯

గీ. జ్ఞానముంబట్టి యుచ్చనీచతలు గలుగుఁ
గాని కేవలజాతిచేఁ గాదు! కాదు!
కాన గర్వోన్నతంబు నీదైన చూపుఁ
గ్రిందికిం దింపి సామాన్యవృత్తి మనుము! ౨౧౦

కం. "చిలుకుఁడు సంస్కృతవిద్యా
జలధి; ననర్ఘ్యమగురత్నజాలము దానం
గలదుచుఁడి! దేవభాషను
వెలివెట్ట దరిద్రుఁడగును విజ్ఞానమునన్. ౪౧౧

ఆ.వె. ప్రకృతిశాస్త్రములను బఠియించి నాస్తిక
వాదులై మెలంగవలదు! వలదు!
ప్రకృతిశాస్త్రములను భారతీయులతత్త్వ
శాస్త్రములను జతగఁజదువ మేలు! ౪౧౨

కం. నిరతంబు సాముసేయుడు !
శరీర మాద్యముగుధర్మసాధనముగదా!
మెఱుఁగిడుకొను నన్యోన్యము
శరీరబలమును ధరిత్రి జ్ఞానబలంబున్. ౪౧౩

కం. పరదేశ్యులు వ్రాసిన మన
చరితలు కల్లలకరుల్లు; స్వమహిమత, స్వే
తరుల లఘిష్ఠత వారికి
గుఱి; భారతబుధులె వ్రాసికొనవలె నింకన్. ౪౧౪

కం. తొలి గూడుగుడ్డలిడి బీ
దల సాదుల మనుపవలయుఁ; దదుపరిఁ గఱపన్
వలె విద్యయు; మానవసే
వలె మాధవసేవలంచు భావింపుఁ డెదన్. ౪౧౫

గీ. "భూతదయ" "భూతదయ" యంచుఁ బ్రాంతిఁ బలుకఁ
బోకుఁడు! భూతదయగాదు భూతసేవ
సకలభూతంబు లీశ్వరాంశములుగాన;
భూతదయ నా సహాయుతా స్ఫూర్తి దోఁచు." ౪౧౬

గీ. అనుచుఁ బ్రత్యుత్తరించె నాయమాయి ప్రాజ్ఞ
సంచయప్రశ్నముల కెల్ల స్వామి సభల
విచ్చె సంశయములు మంచు విచ్చినట్లు;
తేజరిల్లెను జిత్తముల్ దెసలువోలె. ౪౧౭

గీ. స్వామిసంకల్పముఁ గ్రహించి సభ్యులెల్ల
నాయన ప్రపంచమతసభాయాత్రకైన
వ్యయమునకు నైదునూర్ల రూప్యంబులొసఁగఁ
గైకొనండయ్యె గుర్వాజ్ఞ గామి నపుడు ౪౧౮

గీ. పశ్చిమాద్రికిఁ జను నాత్మబాంధవుఁ గని
ముదుఁగుతమ్ములచందాన మోడ్పుఁ గేలు
పరగఁ బౌరులు హైదరాబాదు కరుగు
స్వామివరు సాఁగనంపిరి భక్తిమెరయ. ౪౧౯

గీ. హైదరాబాద్ నవాబు నాహ్వానమంది
పోయి దర్శించి యాతని ముగ్ధుఁ జేసె;
జదువులసరస్వతియకదా! సందియంబె?
అతని ప్రాగల్భ్యముంగాంచి యబ్రపడఁగ. ౪౨౦

గీ. వ్యాసుఁడో! వసిష్ఠుఁడో? యీమహామహుండు
ఆంగ్లవిద్యాచణుండయి యవతరించె
'శకపురుషుఁ'డన్నఁ జెల్లు నీస్వామి యనుచుఁ
దదుపదేశంబువిని ప్రజల్ తలఁచుకొనిరి. ౪౨౧

ఉ. కానుకలిచ్చి ధన్యతను
గాంచ నవాబుదలంచి పంపనా
హ్వానము నిస్పృహుండగుట
నాయన వానిఁదిరస్కరించె; నా
పైని 'నిజా'మిఁకెట్టులని
"పశ్చిమఖండపుయాత్రకై వ్యయం
బేసిభరింతు" నన్న నద
నియ్యదిగాదని యిచ్చె దీవనల్. ౪౨౨

కం. 'ఇసలాము' మతముఁగూర్చి
ససిగ ముసల్మానుబుధుల సంప్రశ్నింపన్
అసమర్థులయిరి వారలు
సుసంగతంబగుజవాబుఁ జూచి వచింపన్. ౪౨౩

గీ. తనదు పశ్చిమఖండయాత్రనుగుఱించి
యెదను దలపోసికొంచు వహింప నిద్ర
స్వామి గలఁగాంచెనొకనాఁడు రామకృష్ణుఁ
డుదధిఁజొచ్చుచుఁ దనుఁబిల్చుచున్నయట్లు ౪౨౪

గీ. అంత మేల్కాంచి స్వామి సాష్టాంగనతులు
సేసి యనె "దేవ! యిగో! ప్రతీక్షించుచుంటిఁ
దావకాజ్ఞకు; నేఁటికి సేవకుఁడగు
నాపయి నీకు దయగల్గెనా?" యటంచు ౭౨౫

గీ. హైదరాబాదునుండి ప్రయాణమయ్యె
స్వామి యాచార్యదేవుని రామకృష్ణు
పత్నియగు శారదాదేవి పాదపద్మ
దర్శనమొనర్చి దీవనల్ తగ గ్రహింప. ౭౨౬

కం. గురుపత్నినాఁగ రెండవ
గురుదేవతయంచు నెంచుకొందురు శిష్యుల్;
గురువుకడక అచువిద్యకు
గురుపత్నిశుభాశిషములగుఁ దోహదముల్. ౭౨౭

గీ. శారదామాత దివ్యాశిషంబులంది
స్వామి చింతించుచుండంగ వ్యయముఁగూర్చి
సిద్ధసంకల్పుఁడగుట విచ్చేసె నొక్క
కమ్మఁగొని లెంకయొకఁ; డిట్లుగలదు దాన. ౭౨౮

గీ. "పూజ్యులగు వివేకానంద బుధతిలకుల
పాదపంకజసంచరద్భంభరంబు;
క్షేత్రిపురరాజు, పెద్దలసేవకుండు
వినతిపూర్వకముగ వ్రాయువిన్నపంబు. ౭౨౯

మ. భవదాశీర్వచనప్రభావమున నా
భాగ్యంబుపైకుబ్బె; మ
ద్భవనంబం దుదయించెఁ జంద్రుఁడు; మదు
ద్యానంబుపుష్పించె; నా
భువియందుర్ లభియించె రత్నఖని; యీ
పుత్రోదయానంద మే
భవదీయంబగు దివ్యదర్శనముచే
వాంఛింతుఁ బూరింపఁగర్. ౪౩౦

గీ. తమరు పశ్చిమఖండయాత్రనుగుణించి
ముచ్చటించుచునుంటిరి యచ్చటచట
నా వ్యయంబును భరియించునట్టిభాగ్య
మొదవునే? నాకటంచుఁబొందుదును జింత" ౪౩౧

కం. అని యున్నజాబుఁగని యా
క్షణమున "సంపన్నమయ్యె సర్వంబును నా
కనఘుఁడు గురుదేవునిదయ"
ననుచుర్ క్షేత్రీపురప్రయాణ మొనర్చెర్. ౪౩౨

ఉ. పొచ్చెము లేనిభక్తిమెయి
భూపవరేణ్యుఁడుఁ దల్లడాంగియుర్
వచ్చినస్వామిదివ్యపద
పద్మయుగంబును సమ్మదాశ్రులం

గ్రచ్చులఁగడ్డి స్వీయకర
కంజములన్ వరివస్యసేసి తా
రిచ్చిరి వానిచేతి కతఁ
డిచ్చిన యా పసిముద్దుపాపనిన్ ౪౩౩

గీ. శిరసునం జేయినిడి ‘ చిరంజీవ ’ యంచు
నతఁడు “స్వస్త్యస్త”టంచు ‘శ్రీర’ స్తటంచు
బిడ్డనాశీర్వదించి, దీవించి వారిఁ
బ్రణతశిరసుల సంతోషపఱచెఁ గరము. ౪౩౪

౧౭ మొదటి అమెరికా ప్రయాణము.

గీ. సర్వసన్నాహములొనర్చి స్వామియాత్ర
కార్యుఁడగు క్షేత్రిపతి యాత్మకార్యదర్శిఁ
బంప వెంబడిఁ, జేరి ముంబాపురంబు
నెక్కెనోడను వీడ్కోలునీయఁ బ్రజలు. ౪౩౫

శా. చీనాలోదిగి బౌద్ధమందిరము లీ
క్షించెన్; జపాన్ దేశ్యముల్
నానాయంత్రపరిశ్రమాలయములం
దర్శించెఁ; దద్వర్గ్యవి
జ్ఞానాభ్యున్నతి, దేశభక్తియును, ద
జ్జాత్యోర్వనిద్రాణ ని
ర్మాణప్రౌఢిని మెచ్చుకొంచమెరికా
రాష్ట్రింబుఁ జేరెం దుదిన్. ౪౩౬

కం. అతఁడు "షికాగో"నడుగిడ
"మతసభ జరుగు నిఁక రెండుమాసములకుఁ; ద
త్ప్రతినిధులును నిర్ణీతుల";
యితి విని తనరాకయయ్యెవృథయని వగచెన్. ౪౩౭

గీ. స్వామి క్షణమూరకుండి "శ్రీరామకృష్ణు
నాజ్ఞ, శారదాదేవిదివ్యాశిషములు
గావు నిష్ఫలములుగ; మార్గంబు నాకు
దొరకకుండద"యని ధైర్యమఱకయుండె. ౪౩౮

కం. ప్రతిభాసమన్వితుండగు
నతండు పెదవింగదల్ప నచ్చటి ప్రజ యు
ద్భుతపడెఁ; గర్ణాకర్ణిగ
శ్రుతమయ్యెను వానిలోఁతు సూరివరులకున్. ౪౩౯

కం. మతపరిషత్ప్రేషిత పం
డితులనె ప్రతినిధులఁగాఁగ నియమించెడి ప
ద్ధతి నుల్లంఘించి సభా
పతి స్వామిని నర్హతమునఁ బ్రతినిధిగఁ గొనెన్. ౪౪౦

మ. నియతంబైన దినంబునందు సభ సం
ధింపంబడెన్; దిగ్విశా
లయశోధుర్యులు వేలమంది విబుధుల్
పాండిత్యనిష్ణాతు ల

య్యాయిదేశార్హములైన వేషములతో
నాసనులై రందు ది
వ్యయ లాస్యంబులయొద్ద నిప్ప్రభములై
పెంపేది కానంబడన్. ౨౨౧

౧౩ విశ్వమత సభారంగము.

ఆ.వె. కావిశాటితోడఁ, గావిలుంగీతోడఁ
బసిఁడివన్నెలీను పాగతోడ
బ్రహ్మతేజముట్టిపడు నాననముతోడ
నచట దర్శనీయుఁడయ్యె స్వామి. ౨౨౨

కం. "ఎవరీతం? డెవరీతం?
డెవరీతం?" డంచు మోములెత్తికనిరి స
భ్యవరులు; వైలక్షణ్యము
ప్రవచింపఁగరాని దెదియొ? వారి కగపడెన్. ౨౨౩

చ. ప్రతినిధు లొక్కరొక్కరె స
భాపతివేదిక నెక్కి తీసి కా
గితములు ముక్కుటద్దము లో
గిన్ సవరించుచు మధ్యమధ్య దృ
క్తతి సభపై నిగుడ్చుచును,
దాండవమాడుచు, బల్లగుద్దుచున్
క్షితి స్వమతంబె మోక్షమును జేర్చునటంచు
నహంకరించుచున్. ౨౨౪

కం. పులుముడు పులిమిరి యా యా
పలుకుల, నాపాతమధుర భావంబుల, వా
రలు; 'బఘపటబటారము లో
పలను లొటార' మనుగతి నుపన్యాసములన్ ౨౨౫

కం. ప్రతిప్రతినిధియును దనకా
గితమె మహత్తమమటంచుఁ గీర్తించుకొనెన్
బ్రతివాఁ డద్దమున ముఖ
ప్రతిబింబముఁగాంచి సుందర మ్మనుకొనఁడే? ౨౨౬

కం. తరువాతి వంతువచ్చెను
నరేంద్రునికి; మొదటఁ గంపనమునొంది యతం
డఱముడిఁగి రామకృష్ణుని
స్మరించి యుత్సాహమొంది చనివేదికకున్. ౨౨౭

గీ. మొగిచి కేలు "సభాయై నమో" యటంచు
హైందవాచారముంబట్టి "అమెరికా స
హోదరీ సహోదరులార !"నాఁ దదీయ
నవ్యసంబుద్ధిఁ గరతాళనాద ముబ్బె. ౨౨౮

కం. అడఁగఁగ సముద్రఘోషము
వడువునఁ గొండొక్కవడి కుపన్యసియింపన్
గడఁగె నతఁ డాశుఫక్కిని
జిడిముడిగొనకుండఁ బలుకుచేడియపగిదిన్. ౨౨౯

గీ. "కలఁడు భగవంతుఁడొకఁడని యిలఁ గలట్టి
యెల్లరు మతస్థులొప్పిరిం; కేమి భేద ?
మనఁగ నదనియమందిరంబునకుఁబోవు
మార్గములె భిన్నభిన్నముల్; మతము లివియె ! ౪౯౦

గీ. వంకలెల్లయుఁ గడలి కేపాఱునట్లు
వివిధమతసంప్రదాయముల్ వేయునేల ?
ఋజువులైనను, గుటిలంబులేని నిజము
సాఁగు నాపరమేశ్వరు సన్నిధికినె. ౪౯౧

కం. "ఎవరేగతి భావించిన
నవుదును బ్రాప్యముగ వారి కారూపముతో
భువి"నంచును భగవంతుం
డు వచించెను గీత నర్జునునకుం బ్రీతిఁ ౪౯౨

గీ. శ్రీపరాత్పరు సాక్షాత్కరించుకొనఁగఁ
దివిరి సామీప్యమార్గంబుఁ దెలుపునట్టి
మతమె యత్యుత్తమంబైన మతము సుండు !
కాదు నిర్ణాయకంబు సంఖ్యాబలంబు. ౪౯౩

గీ. మానసం బద్దమట్లు నిర్మలినమైనఁ
బ్రతిఫలించును దానఁ బరాత్పరుండు ;
జీవి యంతర్ముఖమున నీక్షించెనేని
నతఁడు సాక్షాత్కరించు; దివ్యత్వమొదవు. ౪౯౪

కం. భగవత్సాక్షాత్కారమ
నఁగ నపరోక్షానుభూతినా, మోక్షమునా
భగత్సాయుజ్యమునా,
భగవత్ప్రాప్తియన నొక్కభావమె చుండీ! ౭౫౫

గీ. పుణ్యఫలముగ స్వర్గంబుఁబొంది జీవి
యది సమాప్తంబుగా భూమియందుఁబుట్టుఁ;
గర్మనాశంబువలన మోక్షము లభింప
మరలఁబుట్టక కలియు బ్రహ్మంబునందు. ౭౫౬

గీ. జనుఁడు సేవింపవలయు నౌషధము విడక
దీర్ఘరోగంబు నశియింప దీర్ఘకాల;
మట్లు మనపూర్వపూర్వజన్మాఘు మడఁగఁ
బెద్దవడి దైవతంబు సేవింపవలయు. ౭౫౭

గీ. విరియఁగ మొగిళ్లపిండు వేవెలుఁగులడర
నంబుజాప్తుండు ప్రత్యక్షుఁ డగునుగాదె?
సంచితంబగుకర్మ నాశమునుబొంద
సరగఁ బరమేశ్వరుండు సాక్షాత్కరించు. ౭౫౮

మ. చెఱసాలం బ్రదుబుధుల్ ప్రపంచము నిసీ!
జీవుల్ పురాజన్మలం
బోరిఁగావించిన పాపకర్మలఫలం
బుం బొంద నే తెంచుచుం

దురు; తత్తద్దురితంబుఁబట్టి కలుగున్
న్యూనాధికంబైన శి
క్ష రుజాదుఃఖముఁ దొట్టి; శాశ్వతిక సౌ
ఖ్యంబబ్బు మోక్షంబునన్. ౨౫౯

ఆ.వె. మరలమరల జననమరణముల్ లేకుండ
భగవదైక్యమగుట ప్రాణికిగుఱి;
కర్మఁజిత్తశుద్ధి; జ్ఞానమద్దానఁ, ద
ద్భగవదైక్యమొదవు దానఁదుదికి. ౨౬౦

గీ. అన్యులెల్లరు దలఁచి సుధాబ్ధియంచుఁ
జిత్తగింపంగ సంసారజీవనంబు
భారతీయులు మిఱికికూపంబటంచు
నూబినేలంచుఁ గడు నేవగించినారు. ౨౬౧

సీ. పసిఁడిదువ్వలువలు విసిరిపాఱఁగ వైచి
కావిపుట్టంబులఁ గట్టినారు
రమణీయరత్నసౌధము లలక్ష్యమొనర్చి
చీఁకటిగుహాల వసించినారు
రసరసాన్నములు నీరసమంచుఁ బోఁద్రోసి
వ్రేళ్లు వెల్లఁకుల సేవించినారు
పువ్వులసెజ్జలు దవ్వుదవ్వుల రోసి
పఱపురానేలలఁ బండినారు.

సీ. ఆత్మభోగార్థము విచిత్రయంత్రములను
బహులు గని పెట్టుచుండంగ భారతర్షు
లాత్మమోక్షార్థము తపంబు నాచరించి
యాపరాత్పరుఁగాంచి రత్యద్భుతముగ ౮౬౨

సీ. అన్యదేశ్యుల గమ్యలక్ష్యంబు చూడ
నాకలోకంబ; ప్రాచ్యదేశర్షి "అదియు
నశ్వరంబిస్సి" యని రోసి శాశ్వతంబు
నపునరావృత్తియగులోక మభిలషించె ౮౬౩

సీ. అన్యదేశ్యులసంస్కృతి యాశ్రయించి
పత్తనపురంగములఁ దాండవంబునాడ
భరతదేశ్యులసంస్కృతి వాసముండె
శైలగుహాలందు వనతరుచ్ఛాయలందు ౮౬౪

కం. పరతత్త్వంబును సాక్షా
త్కరించుకొన్నట్టి ఋషులు ద్రష్టలు గల రెం
దఱో! హిందుదేశమందుం;
బరదేశములం దొకండు పరగెనె! చెప్పుఁడా! ౮౬౫

మ. తనచుట్టుం బెనుగూఁటి నల్లుకొని త
ద్గర్భంబునంజిక్కి పె
ల్చన రాఁజాలక పైకి నందె మడియున్
సాలీం; డ్లటుల్ భోగ్యవ

స్తునికాయంబును సృష్టిసేసికొని హా
ద్దుల్ మీఱి నందుండి మో
క్షణముం బొందఁగ దారిఁ గన్గొనరు పా
శ్చాత్యుల్ శతాబ్దాలకున్ ౪౬౬

గీ. ఇదె సనాతనమతతత్త్వ; మీమతంబె
హైందవీయంబు, వైదికం, బౌపనిషద,
మార్గము, నటంచు భిన్నభిన్నాహ్వయముల
వ్యవహరింతురు; వీని సిద్ధాంత మొకటె ! ౪౬౭

గీ. విశ్వభాషలఁగల గ్రంథబృందమందు
నాద్యములు వేదముల; వానియాది దెలియ;
దట్లగుట వేదమతమును వ్యవహరింతు)
విబుధులు సనాతనంబని పేరుపెట్టి ౪౬౮

గీ. అవనిఁ గ్రీస్తుమహమ్మదీయాదిమతము
లయ్యయిప్రవర్తకులంబట్టి యాధునికము ;
లీసనాతనమతము గాకివ్విధంబు
ఉన్న దజ్ఞేయకాలంబునుండి కనుఁడు. ౪౬౯

గీ. కావున సనాతనమతంబె కన్నతల్లి
యఖిలమతముల; కిందు లేనట్టి వితర
మతములం గానరావు ధర్మములు; దీన
నున్న వేకొన్నియో యొప్పుచుండు నందు." ౪౭౦

ఆ.వె. ఇట్లు సజలజలదమట్లు గంభీరరా
వంబుతోడ సభ నుపన్యసించు
చాఁగి నిముస, మడిగె హైందవమతతత్త్వ
మెఱిఁగియున్నవార లెందఱ? అంచు    ४८१

చ. అనవుడుఁ జేతులెత్తి రట
నైదుగు రార్గురె వేలమందిలో
ననె నపు డావివేకుఁ డిటు;
"లక్కట! మామతబాలశిక్షలుం
గనుఁగొననట్టి పండిత శి
ఖామణు లెందఱో! వెఱ్ఱిగా విమ
ర్శన మొనరింత్రు; లాఁతు లిటు
సల్పిన మీరలు సైఁచియుందు రే? ४८२

గీ. స్వమతపరమతధర్మతత్త్వము లెఱింగి
పరమతవిమర్శనముసేత పాడియగును;
జ్ఞానలవదుర్విదగ్ధులఁ గాంచి వీరి
బాలకు లటంచు క్షమియింత్రు ప్రాజ్ఞవరులు."    ४८३

ఆ.వె. అని యుపన్యసించి హస్తాబ్జములుమోడ్చి
వినయమునఁ గృతజ్ఞతను వచించి
యాసనంబుడిగ్గ నత్యద్భుతముగఁ జ
ప్పట్లవాన గురిసి పెద్దవఱదవాఱె.    ४८४

కం. ప్రతివిషయము గ్రొంగ్రొత్తై
ప్రతిశబ్దము నూతనార్థబంధురమగుచున్
అతితమముగ నాశ్చర్యచ
కితులం గావించె నతనికృతభాషణలోన్. ४८४

కం. దివిటీకడ దివ్వెలవలె
'వివేకు'కడఁ గానఁబడిరి పెఱప్రతినిధు; ల
ప్లవలోకించిరి సభ్యులు
భువికి దిగిన దేవదూతపోలికి నతనిన్. ४८६

కం. కరచాలనంబొనర్చిరి
తటిసి మహామహులు పండితశిరోమణు ల
త్తటి; స్వామిఁ బ్రశంసించిరి
పరస్పరముఁ ద్రోసికొంచువచ్చి సభికులున్. ४८८

చ. మతసభయందుఁ బొల్గొనిన
మాన్యులలో శశిపోలెఁ దారకా
వితతినిఁ దేజరిల్లెను వి
వేకుఁడె సర్వకళాప్రపూర్ణుఁడై
కుతుకమెలర్ప సభ్యులు చ
కోరములట్లులు ప్రీతిఁ దద్వచో
మృతమునుగ్రోలి; రివ్విధము
నెవ్వరుఁగాంచరు పూర్వమెన్నఁడున్

సీ. పులకండములమొత్తమును బైకిదొరలించు
మాద్రి నింపారెను మధురకంఠ;
మతిలోకమైన పూజ్యతకు సాక్ష్యంబిచ్చు
తెగనుండె వినయవిధేయవృత్తి;
లమరగంగాప్రవాహమునకు సైదోడు
రహినొప్పె నాశుధారాక్రమంబు;
విజ్ఞానరాశిని వెసఁ జేటలంజెర్వు
నట్టులం దగె నుపన్యాససరణి;

గీ. మేరమీఱినప్రతిభ, మైసా, రివెల్ల
మించి యొకదానినొకటి యూహించరాని
పగిది లోకోత్తరత్వంబుఁ బగటు; నిట్టి
విబుధమణి "నభూతో నభవిష్యతి" క్షితి ౨౭౯

కం. అతని ముఖనిస్సృతంబగు
ప్రతిశబ్దము వదల కక్షరము నాత్రముతోఁ
బ్రతివారు వినిరి; నిశ్చే
ష్టితులయి వీక్షించి; రుగ్గడించిరి వానిన్. ౨౮౦

శా. వార్తాపత్రికలెల్ల స్వామిమహితో
పన్యాసముం, బాండితీ
స్ఫూర్తిం, గీర్తినిఁ, బూర్తినిం బొగడుచున్
ముద్రించె వ్యాసంబులన్;

హర్తింబట్టె 'షికాగో' పత్త్రసజనం
బాపూజ్యుఁ డూరేఁగుచోఁ;
నర్తించెం బురకుడ్యపంక్తిని నగ
ణ్యంబైన తచ్చిత్రముల్. ౪౮౧

కం. అహమహమిక నప్పౌరులు
మహోమహునికి నతనికి సమర్పించిరి తా
రహరహ మాతిథ్యంబులు;
విహాయసంబంటి యతఁడు వెలిఁగె రవివలెన్. ౪౮౨

కం. అలక్రైస్తవపాషండుల
కులపత్త్రిక వ్రాసె; "నిట్టికోవిదులకుఁ దా
వలము భరతదేశము; వా
రలకే మనబోధకులు గఱపువార లిసీ? ౪౮౩

కం. రతనంబు శ్రీవివేకుం
డితరబుధులు గులకరా లిసీ! మతసభలోఁ;
రతనము లితరులునగుచోఁ
నతఁడు * "కులీనన్"రతనమయుగు నిక్కముగన్. ౪౮౪

* ప్రపంచమందలి రత్నములన్నిటిలోఁ బెద్దది 'కులీనన్' రత్నము. ఇది ౩౦౧గో కేరట్లతూకము గలది.

గీ. వేయు నేటికిఁ? బాశ్చాత్యవిజ్ఞకోటి
వారి శుశ్రూషఁగావించి వ్రాల్చి శిరసు
వారివిద్యలుగఱచుటే వాంఛనీయము;
మందుకై బోధకులఁబంపు టర్హా" మనుచు. ౪౩౧

చ. "నలువది యేండ్లనాఁడు మత
నాయకులైన భవాదృశార్య లీ
స్థలమున నిట్లు క్రైస్తవ మ
తంబు విమర్శమొనర్చియున్నచో
శిలలను రువ్వియో? శిరసు
ఛిన్నమొనర్చియొ? కాల్చివేసియో!
నిలువునఁ జంపియుం"డని య
నెన్ బుధుఁడొక్కఁడు దాసి స్వామితోన్.

కం. "స్వమతాహంకారోన్మా
దము నరనరముల జితించి తప్పితిరుగు ప
శ్చిమసీమఁ జికిత్సింపఁగ
నమోఘవైద్యుండవీవె!" యని యొక్కఁడనెన్. ౪౩౨

గీ. సభ్యరంజన మొనరింపఁజాలనట్టి
వక్తృపన్యాసమును వీడి బయలికేగు
పారిషద్యులఁగని సభాపతి వచించు
"వేచుఁడీ! యుపన్యసించు వివేకుఁ"డంచు. ౪౩౩

గీ. “అయిదునిమిషాల తడవె మాటాడు”ననిన
గోణుగుకొంచేదో ? పక్షపై నణుఁగుకొంచుఁ
నయిదుగంటలు వేచియుం ద్రతనికొఱకు
విసరుకొంచును నా మందువేసఁగితఱి. ౪౧౯

## ౧౪ అమెరికాదేశ పర్యటనము

కం. మతసభలోఁ బ్రాపించిన
ప్రతీతినింగాంచి స్వామ్యుపన్యాసములన్
ఇతరత్ర యేఱుపరచిరి
మతిమంతులు గొంద ఱొక సమాజముపేరన్. ౪౨౦

చ. అనుకొనె స్వామి” యమ్యెమెరి
కాదిక పశ్చిమసీమలన్ సనా
తనమతధర్మతత్త్వమును
దానఁ బ్రచారముసేయవచ్చు ” నం;
చనుకొని నాసమాజగతు
లా మిషచే ధనముంగడింప వ
చ్చుననుచు; స్వార్థబుద్ధు లవి
శుద్ధులు పశ్చిమఖండమానవుల్. ౪౨౧

గీ. అమెరికాదేశమందు ముఖ్యాతిముఖ్య
పట్టణంబుల నన్నింటి స్వామి దిరిగి
వరసనాతనధర్మ ముపన్యసించి
మోహముంద్రుంచి వారి యపోహ లడఁచె. ౪౨౨

